# మరణానంతరవిధి

(ఆశౌచ, అపర, శ్రాద్ధ ప్రకరణములు)



సంకలన కర్తలు :

ముత్య వీర వేంకట దీక్షితులు, పొన్నపల్లి వేంకట కృష్ణయ్య

# విషయసూచిక

## ఆశౌచ ప్రకరణము


జ్ఞాతులు 7
ఆశౌచనియమాలు 8
జాతాశౌచము 9
జాతాశౌచ పట్టిక 10
మృతాశౌచ పట్టిక 11
బంధుత్వాలు 12
కొన్ని విశేషాంశాలు 16


## అపర ప్రకరణము


శ్రాద్ధకర్తలు 19
భూశయనము 22
శవస్నానము, ప్రాయశ్చిత్తము 23
శవయాత్ర 24
దహనము 25
అస్థి సంచయనము, నిమజ్జనము 28
నిత్యకర్మ 29
నవశ్రాద్ధములు 31
దశాహము, ఏకాదశాహము 31
సపిండీకరణము 33
సందిగ్ధ పరిస్థితులు 35




## శ్రాద్ధ ప్రకరణము


ఉపోద్ఘాతము 40
తిథి నిర్ణయము 40
అపరాహ్ణకాలం అంటే ఏమిటీ ? 41

అధిక, క్షయమాసములు 43
భోక్త-లక్షణములు 45
భోక్తలను పిలిచే పద్ధతి 46
భోక్తలు పాటించవలసిన నియమాలు 46
కర్త పాటించవలసిన నియమాలు 48
శ్రాద్ధము రోజు పాటించవలసిన నియమాలు 49
విచ్ఛిన్నౌపాసనము 49
కూర్చ, పవిత్రము 50
దొన్నెలు 51
వంట 52
కర్త, భోక్తలు చెప్పవలసిన మంత్రాలు 53
ఆచమనము 56
పాద్యము 56
ఆసనములు 58
అర్ఘ్యపాత్రలు 58
అగ్నౌకరణము 59
వడ్డన 59
అన్నపరివేషణము 61
భోక్తల భోజనము 61
పిండ ప్రదానము 62
ఆసీమాంతం 63
ధర్మసూక్ష్మాలు 64
కర్మ మధ్యలో ఆబ్దికము 65
ఇతరములు 66
దశదానములు 68
షోడశమహాదానములు 68

# మరణానంతర విధి

## ఆశౌచ ప్రకరణము

### ఆశౌచమంటే ఏమిటి ?

ఒక కుటుంబంలో శిశువు పుట్టినప్పుడుగాని, ఆ కుటుంబంలోని ఒక వ్యక్తి చనిపోయినపుడుగాని, ఆ కుటుంబంలోని వారు, మరికొందరు సన్నిహిత బంధువులు 'అశుచి'గా అవుతారని పూర్వకాలం నుంచి వస్తున్న విశ్వాసం. ఈ 'అశుచి' భావానికే ఆశౌచము అని పేరు. శిశుజననంవల్ల ఏర్పడే ఆశౌచాన్ని జాతాశౌచము లేదా పురుడు అనిన్నీ, వ్యక్తి మరణంవల్ల ఏర్పడే ఆశౌచాన్ని మృతాశౌచము లేదా మైల లేక పక్షిణీ అనిన్నీ అంటారు. మనది చాలాకాలంగా పితృస్వామ్య వ్యవస్థ కావటంవల్ల ఆశౌచ విషయంలోకూడా పురుష సంతతి, అన్నదమ్ములద్వారా ఏర్పడిన బాంధవ్యాలకే ప్రాధాన్యం ఇవ్వబడింది. ఇంటిపేరు, గోత్రంకూడా పురుష సంతానపరంగానే నిర్ధారణ అవుతున్నాయి. అందువల్ల ముందుగా కొన్ని ముఖ్య బంధుత్వాలను గురించి తెలుసుకొందాము.

### జ్ఞాతులు

**సపిండులు** : ఒక పురుషునికి తనతండ్రి, తాత, ముత్తాత ఈ విధంగా ముత్తాత ముత్తాతవరకూ గల పూర్వీకులను తీసుకొని, ఆముత్తాత ముత్తాత తాలూకు (పురుష సంతతి ద్వారా వచ్చిన) వంశంలోని వారంతా తనకి సపిండులు అవుతారు. అంటే తననుంచి ఏడు తరాలవరకూ మాత్రం వెనుకకు వెళ్లి, ఆ మూలపురుషునికి చెందిన వంశంలో వారన్నమాట. ఈ సపిండుల విషయంలో సాధారణంగా పురుడుగాని మైలగాని పూర్తిగా ఉంటుంది. దీనిని పూర్ణాశౌచము లేక దశ రాత్రాశౌచము అంటాము. ఇది బ్రాహ్మణులకు 10 రోజులు, క్షత్రియులకు 12 రోజులు, వైశ్యులకు 15 రోజులు, శూద్రులకు 30 రోజులు ఉంటుంది. ఆ రోజులు గడచిన తరువాత స్నానం చేసిన మీదట ఆశౌచ శుద్ధి కలుగుతుంది.

**సమానోదకులు :** (సోదకులు) ఒక పురుషునికి పై విధంగా 14వ తరం వరకు వెనక్కి వెళ్లి ఆ మూలపురుషుని సంతతికి చెందిన వారిలో సపిండులు కానివారిని సమానోదకులు అంటాము. వీరి విషయంలో సాధారణంగా ఆశౌచము బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులకు వరసగా 3, 4, 5, 8 రోజులుంటుంది. (దీన్ని త్రిరాత్రాశౌచము అంటాము).

**సగోత్రులు :** పై విధంగా 21వ తరం వరకు వెనక్కివెళ్లి ఆ మూలపురుషుని సంతతికి చెందినవారిలో సపిండులు, సమానోదకులు కానివారిని సగోత్రులు అంటాము. ఇంతకంటే ఎక్కువ తరాలు వెనక్కి వెళితేనేగాని జ్ఞాతిత్వం తెలియని సందర్భాలలో, గోత్రం ఇంటి పేరు కలిసినా సగోత్రులుగా భావించము (ఇది ఆశౌచ వివరణలో మాత్రమే) సగోత్రులకు జాతాశౌచమైనా, మృతాశౌచమైనా స్నానముతో శుద్ధి.

సపిండులు, సమానోదకులు, సగోత్రులు అనే వర్గీకరణం వ్యాఘ్రపాదుడు, పరాశరుడు మొదలైన మహర్షులచే చెప్పబడింది. ఇక్కడ ఒక ధర్మసందేహం రావచ్చు. ఒక మూలపురుషుని సంతతివారిలో ఒక పుత్రునిద్వారా రామయ్య 7వ తరానికి, మరొక పుత్రుని ద్వారా భీమయ్య 8వ తరానికి చెందారనుకుందాము. రామయ్యకు భీమయ్య సపిండుడవుతాడు గాని భీమయ్యకు రామయ్య సపిండుడు కాడని, కేవలం సమానోదకుడేనని పై నిర్వచనం నుంచి తెలుస్తోంది. అందుచేత భీమయ్య జనన మరణాలలో రామయ్యకు పూర్ణాశౌచం ఉంటుంది గాని, రామయ్య విషయంలో భీమయ్యకు త్రిరాత్రాశౌచమే. అయితే భీమయ్య తండ్రి జీవించి ఉంటే వారి సపిండులందరి విషయంలోనూ తాను, తన సంతతి పూర్ణాశౌచం పట్టాలి. ఇలాగే సమానోదక సగోత్రుల విషయంలో కూడా నిర్ణయించుకోవాలి. (వెంకోజీయం, భట్టోజీయం, నాగోజీయం)

## ఆశౌచనియమాలు

ఆశౌచవార్త విన్న వెంటనే స్నానం చెయ్యాలి (జాతాశౌచవార్త వినగానే స్నానం చెయ్యటం ఆచారంగా లేదు) తరువాత బంధుత్వాన్ని బట్టి పట్టికలలో ఉన్నట్లుగా ముక్తకాలం ఆశౌచం పట్టాలి (పక్షిణి, ద్విగుణపక్షిణి గురించి కూడా పట్టికల తరువాత

వివరించడం జరిగింది) ఆశౌచకాలంలో సంధ్యావందనం మొదలైన నిత్యానుష్ఠానాలు పూర్తిగా చెయ్యకూడదు. సంధ్యావందనంలోని ప్రాణాయామం, మార్జన, మంత్రం ఉచ్చరించకుండా చేయాలి. అర్ఘ్యప్రదానంతో సంధ్యావందనం ఆపేయాలి (ధర్మసింధు). వైశ్వదేవం, బ్రహ్మయజ్ఞం మొదలైన పంచ మహాయజ్ఞాలు మానేయాలి. వేదాధ్యయనం కూడదు. ఔపాసనహోమం సగోత్రుడు కాని బ్రాహ్మణునిచేత చేయించాలి (అటువంటి బ్రాహ్మణుడు దొరకకపోతే తానే చేయవచ్చునని కొందరి అభిప్రాయము). ఆశౌచదినాలలో ఆబ్దిక తిథి (తద్దినం) వచ్చినట్లయితే ఆశౌచశుద్ధి అయిన రోజున ఆబ్దికం పెట్టాలి. ఆ శుద్ధి రోజు శూన్యతిథి అయితే మరునాడు పెట్టాలి (ధర్మసింధు), ఊనషాణ్మాసికం మాత్రం శూన్యతిథినాడైనా పెట్టవచ్చు. నిత్యభోజనం చేస్తుండగా మృతాశౌచవార్త తెలుస్తే వెంటనే నోటిలో వున్న ముద్ద వదలి స్నానం చేయాలి. ఆ ముద్ద తింటే ఆ రోజంతా ఉపవాసం ఉండాలి. మృతాశౌచవార్త విన్నాక భోజనం పూర్తి చేస్తే మూడు రోజులు ఉపవాసం చెయ్యాలి. ఆశౌచం పట్టేవారు వండిన అన్నాన్ని ఇతరులు ఒకసారి తిన్నా వారితోపాటు వీరు కూడా ఆశౌచం పట్టాలి. పురిటి వారిని (శిశువును తల్లిని తప్ప) ఇతరులు ముట్టుకున్నా దోషం లేదు (బొడ్డు కోశాక స్నానం చేసేవరకు శిశువు తండ్రికి అస్పృశ్యత ఉంటుంది) మైలవారిని ఇతరులు ముట్టుకోకూడదు. ముట్టుకుంటే బట్టలు తడిపి స్నానం చేసి నూతన యజ్ఞోపవీతం ధరించాలి. మృతాశౌచ దినాల్లో మగవారు గంధాన్నే బొట్టులాగ పెట్టుకోవాలి, స్త్రీలు నల్లబొట్టు పెట్టుకోవాలి. మైలవారు తాకిన వంటసామగ్రిని ఇతరులు వాడకూడదు. పురుడులో పురిటివారు తాకిన వంటకాలు, ఊరగాయలు మాత్రమే ఇతరులు తినరాదు, తాకరాదు. తక్కిన సామగ్రికి ఈ నియమం లేదు. ఎన్ని రోజులు ఏ ఆశౌచమైనా శుద్ధి రోజున స్నానానంతరం ద్విజులందరు నూతన యజ్ఞోపవీతం ధరించాలి. ఏ ఆశౌచమైనా (బహిష్టు, ప్రసూతితో సహా) శుద్ధి రోజున సూర్యోదయానంతరం సుమారు 2 1/2 గంటల తరువాతనే స్నానం చేసి శుద్ధులుకావాలి.

**జాతాశౌచము :**

(పురుడు) గర్భిణీస్త్రీకి 4 మాసాలు నిండక పూర్వం గర్భనష్టం కలిగితే దానిని గర్భస్రావము అంటారు. 5వ, 6వ నెలల్లో అయితే గర్భపాతము అంటారు. 7వ

నెల ప్రవేశించాక మృత శిశువు జన్మించినా, జీవించిన శిశువు జన్మించినా దానిని ప్రసవము అంటారు. ఈ సందర్భాలలో ఎవరెన్ని రోజులు పురుడు అనగా జాతాశౌచం పట్టాలో పట్టికలో చూపటం జరిగింది. ప్రసవ సందర్భంలో తల్లికి గల పురుడును ప్రసూత్యాశౌచం అంటాము.

**ఆశౌచబలాలు** : జాతాశౌచం కంటె మృతాశౌచానికి (మైలకు) రెట్టింపు బలమని, దానికంటె రజస్వలా శౌచానికి (బహిష్ఠ స్త్రీ) రెట్టింపు బలమని, దానికంటె ప్రసూత్యా శౌచానికి రెట్టింపు బలమని, దానికంటె శవవాహకుల ఆశౌచానికి రెట్టింపు బలమని విష్ణు పురాణంలో ఉన్నది. వీటిలో జాతాశౌచం (పురుడు) మినహాయించి మిగిలినవి వచ్చిన వారిని ఇతరులు తాకరాదు.

**జాతాశౌచ పట్టిక**

| వ.స. | సందర్భ వివరణ | తల్లి | తండ్రి | అన్నలు | సపిండులు | సమానోదకులు |
|---|---|---|---|---|---|---|
| 1 | 3వ నెల నిండకముందు గర్భస్రావమైతే | 3 | స్నా | స్నా | స్నా | – |
| 2 | 4వ నెలలో గర్భస్రావమైతే | 4 | స్నా | స్నా | స్నా | – |
| 3 | 5వ నెలలో గర్భపాతమైతే | 5 | 3 | 3 | 3 | – |
| 4 | 6వ నెలలో గర్భపాతమైతే | 6 | 3 | 3 | 3 | – |
| 5 | 7వ నెలలో ప్రసవమైతే (మృతశిశువు గాని, బొడ్డుకోసే వరకు బతికినాగాని) | పూర్ణ | 7 | 7 | 7 | 3 |
| 6 | 8వ నెలలో ప్రసవమైతే (ప్రైవిధంగానే) | పూర్ణ | 8 | 8 | 8 | 3 |
| 7 | 9వ నెల, ఆ పైన ప్రసవమైతే (పైవిధంగానే) | పూర్ణ | పూర్ణ | పూర్ణ | పూర్ణ | త్రిరాత్ర |
| 8 | బ్రతికి ఉన్న శిశువు పుట్టి బొడ్డు కోయకుండా చనిపోతే | పూర్ణ | 3 | 3 | 3 | స్నా |



**గమనిక** : మగశిశువు జన్మిస్తే మాతామహుడు, మాతామహి అనగా తాతయ్య, అమ్మమ్మ 3 రోజులు పురుడు పట్టాలి. తల్లివైపు ఇతర బంధువులకు పురుడు లేదు. సంఖ్యగా రోజులు చెప్పినవి అన్ని వర్గాలకు సమానమే. పూర్ణ అంటే 10/12/15/30 అని, త్రిరాత్ర అంటే 3/4/5/8 అని గమనించండి. 9వ నెల, ఆపైన ప్రసవం జరిగితే మాత్రమే సగోత్రులు స్నానం చెయ్యాలి. 7, 8 నెలలో ప్రసవమైనా సపిండులంతా పూర్ణజాతాశౌచం పట్టాలని నిర్ణయసింధులో ఉన్నది.

**నెలపురుడు :** ప్రసవించిన స్త్రీకి 10 రోజులు ప్రసూత్యాశౌచము, ఆ తరువాత మగశిశువైతే 20 రోజులు, ఆడశిశువైతే 30 రోజులు నెలపురుడు అంటారు. ఈ నెల పురుడు, పురిటిశుద్ధి నాటి సాయంత్రం సూర్యాస్తమయం నుండి ప్రారంభం. ఈ సమయంలో శుభకార్యాలుగాని, వ్రతాలుగాని, మడివంటలు ఇత్యాది కర్మలు చేయకూడదు.

## మృతాశౌచ పట్టిక

| వ.స. | సందర్భము | తల్లిదండ్రులు సోదరులు పెళ్లికాని అక్కాచెల్లెలు | సపిండులు | సమానోదకులు | సగోత్రులు |
|---|---|---|---|---|---|
| 1. | బొడ్డుకోసినప్పటి నుంచి పురిటిశుద్ధి వరకు | స్నా | స్నా | – | – |
| 2. | పురిటిశుద్ధి నుంచి నామకరణం/మరునాటి ఉదయం వరకు ఏది ముందైతే అది గ్రహించాలి | మగ–3<br>ఆడ–1 | స్నా<br>స్నా | –<br>– | <br>– |
| 3. | నామకరణంనుంచి దంతజననం/6నెలలు పూర్తి | 3/1 | 1/స్నా | – | – |
| 4. | దంతజననం నుంచి చూడాకర్మ/3సం. పూర్తి | 3 | 1/స్నా | – | – |
| 5. | చూడాకర్మ నుంచి ఉపనయనం వరకు (బాలుడు) | 3 | 3 | స్నా | స్నా |
| 6. | చూడాకర్మనుంచి వాగ్దానం లేదా ప్రధానం వరకు (కన్య) | 3 | 1 | స్నా | స్నా |
| 7. | వాగ్దానం నుంచి వివాహం వరకు (కన్య) | 3 | 3 | స్నా | స్నా |
| 8 | ఉపనయనమైన పురుషుడు | పూర్ణ | పూర్ణ | త్రిరాత్ర | స్నా |



**గమనిక :** 1. వాగ్దానం తరువాత వివాహంలోగా కన్య చనిపోతే వరుడు, అతని సపిండులు 3 రోజులు, తక్కిన జ్ఞాతులు స్నానం చెయ్యాలి. వివాహిత స్త్రీ మరణిస్తే ఆమె భర్తయొక్క సపిండులు పూర్ణాశౌచము, తక్కిన జ్ఞాతులు ఆయా ఆశౌచాలు పట్టాలి.

3. పై పట్టికలలో స్థలాభావంవల్ల సపిండులు, సమానోదకులు, సగోత్రులు అని వ్రాశాము. కాని నిజానికి పుట్టిన శిశువు లేదా చనిపోయిన వ్యక్తి ఎవరికి సపిండుడు వగైరా అవుతాడో వారు అని అర్థం చేసుకోవాలి.

ఉపనయనం కాకపోయినా ఉపనయన వయస్సు దాటితే అనగా గర్భం 9 నెలలు కలుపుకొని బ్రాహ్మణులకు 8 సంవత్సరాలు, క్షత్రియులకు 11 సంవత్సరాలు, వైశ్యులకు 12 సంవత్సరాలు నిండుతే ఉపవీతులుగా భావించి బంధువులు వారి మృతి సందర్భంలో ఆశౌచం పట్టాలని కొందరి అభిప్రాయము (యాజ్ఞవల్క్యుడు) కాని ఆచారంలో ప్రత్యక్ష ఉపనయనాన్నే పాటిస్తున్నారు. శూద్రుల విషయంలో ఉపనయనం బదులు వివాహం లేదా 16 సంవత్సరాలు నిండటం (ఏది ముందైతే అది) తీసుకోవాలి.

ఏ కారణంచేతనైనా తల్లిదండ్రులలో ఒకరి కర్మ 12 రోజుల తర్వాత ప్రారంభించి జరిపే కర్తకు కర్మాంగాశౌచం ఉంటుంది. దీనిమధ్యలో జ్ఞాతిమృతాశౌచం సంక్రమిస్తే ఆ ఆశౌచం కర్మాంగా శౌచశుద్ధితో పోదు. ఆ తరువాత జ్ఞాతి ఆశౌచం మిగిలిన రోజులు పట్టాలి. ఇది పురుడైతే వర్తించదు. కర్మాంగాశౌచం శుద్ధితో మధ్యలో వచ్చిన పురిటికి శుద్ధి కలుగుతుంది.



ఇప్పుడు సగోత్రత్వం ద్వారా కాకుండా ఇతర బంధుత్వాల గురించి తెలుసుకొందాము.

## బంధుత్వాలు

**ఆత్మబంధువులు** : పినతల్లి, పెదతల్లుల సంతానము, మేనత్త సంతానము, మేనమామ సంతానము

**పితృబంధువులు** : తన తండ్రియొక్క ఆత్మబంధువులు

**మాతృబంధువులు** : తనతల్లి యొక్క ఆత్మబంధువులు

ఇటువంటి బంధువులకు వచ్చే మృతాశౌచం ద్విగుణపక్షిణి, పక్షిణి, స్నానమాత్రంగా విభజించబడింది.

**ఆశౌచదినాలు ఎప్పటినుంచి లెక్కించాలి ?** శిశువు జన్మించిన రోజు నుంచి పురుడు, వ్యక్తి చనిపోయిన రోజునుంచి మైల లెక్కిస్తాము. జననం లేక మరణం రాత్రి జరుగుతే సూర్యాస్తమయం నుంచి మరునాడు సూర్యోదయం దాకా గల కాలాన్ని మూడు సమభాగాలుగా చేసి మొదటి రెండు భాగాల్లో అయితే ముందు రోజున జరిగినట్లు, మూడవ భాగంలో అయితే మరునాడు జరిగినట్లు భావించాలి.

పూర్ణాశౌచవార్త విన్నవారు ఆశౌచదినాలలో ఎప్పుడు విన్నా ఆశౌచశేషం పడితే చాలు. అయితే ఆశౌచం చివరిరోజు రాత్రి మొదటి మూడు జాములలో వింటే తరువాత రెండు రోజులు, నాలుగవజాములో వింటే తరువాత మూడు రోజులు పట్టాలి (ధర్మప్రవృత్తి). దీన్ని క్రాంతాశౌచము అంటారు. ఇది పూర్ణాశౌచం పట్టవలసినవారికే. ఆశౌచ దినాలు గడిచాక వింటే స్నానంతో శుద్ధి. ఉపనయనం కానివాని మరణం 3 రోజులు దాటాక వింటే సపిండులకు స్నానంతో శుద్ధి.

**పక్షిణ్యాశౌచము :** పక్షిణి అనగా సపిండులు, సమానోదకులు, సగోత్రులు కాని ఇతర బంధువులు పట్టే ఆశౌచమును పక్షిణీ అని అంటారు. ఇది రెండు రకములు 1. ద్విగుణపక్షిణి (3 రోజులు) 2. పక్షిణి (90 గడియలు)

**పక్షిణీ పట్టే విధము :** మృతదినం నుంచి మూడు రోజులలోగా వార్త తెలిస్తే పక్షిణీదారులు నాలుగవరోజు ఉదయం వరకు పక్షిణీ పట్టి అప్పుడు స్నానం చెయ్యాలి. మూడవరోజు రాత్రి నుంచి 10వ రోజు రాత్రిలోగా వింటే 90 గడియలు (మూడు పూటలు)గాని, 11వ రోజు ఉదయం వరకుగాని (ఏది ముందైతే అది) పట్టాలి.



**ద్విగుణపక్షిణి :** కొందరు ముఖ్యబంధువులు మూడు రోజులు పక్షిణి పట్టవలసిన సందర్భాలుంటాయి. వీరు మృతతిథి నుంచి 3 రోజులలో వార్త తెలిస్తే 4వ రోజు ఉదయం శుద్ధి. 4 నుంచి 10 రోజుల్లోగా ఎప్పుడు మృతి వార్తవిన్నా మూడు రోజులు ఆశౌచం పట్టాలి (ఈ లోగా 11వ రోజు వస్తే, ఆ రోజునే శుద్ధి) ఈ మూడు రోజుల లెక్క అన్ని వర్ణాలకు సమానమే.

**ద్విగుణపక్షిణీ పట్టవలసినవారు :** ఉపనయనమైన పురుషుని విషయంలో 1) మాతామహుడు 2) మాతామహి 3) దౌహిత్రుడు 4) దౌహిత్రి 5) వివాహిత కుమార్తె 6) వివాహిత సోదరి 7) అత్తగారు 8) మామగారు (అవివాహిత కుమార్తె, అవివాహిత సోదరి పూర్ణాశౌచం కిందికి వస్తారని గమనించండి) 9) మేనమామ 10) మేనమామ భార్య 11) మేనత్త 12) పినతల్లి, పెదతల్లి 13) మేనల్లుడు 14) అల్లుడు 15) ఆచార్యుడు 16) ఆచార్యుని భార్య 17) శిష్యుడు ఈ బంధుత్వాలలో పరస్పరం ద్విగుణపక్షిణి ఉంటుంది. ఉపనయనం కాని బాలుడు గాని, కన్యగాని మరణిస్తే ఈ ద్విగుణపక్షిణీదార్లకు స్నానంతో సరి (షడశీతి, మార్కండేయః) అన్యగోత్రంలోకి

దత్తత వెళ్లిన వ్యక్తి తన జనక తల్లిదండ్రులకు ద్విగుణపక్షిణి పట్టాలి. ఉపవీతుడైతే అతనికి వాళ్లు పట్టాలి. సపిండులు కాని ఎవరికైనా దహనసంస్కారం చేస్తే, చేసినవానికి 3 రోజులు ఆశౌచం (మనుః) ఈ 3 రోజుల ఆశౌచం అనాధ ప్రేత సంస్కారం విషయంలో వర్తించదు. అట్టి దాహకునికి స్నానంతో శుద్ధి. ఈ దాహకుడు సంచయనం చేసిన అనంతరం అసలు కర్త వస్తే, ఇతనికి పూర్ణాశౌచం ఉంటుంది.

**పక్షిణీ పట్టవలసిన వారు** : పురుషునికి పక్షిణీదార్లు 1) మేనమామ, అతని భార్య, వారి సంతానము 2) పినతల్లి పెదతల్లులు, వారి సంతానము 3) మేనత్త, ఆమె సంతానము 4) భార్యయొక్క సోదరీసోదరులు 5) వివాహిత సవతి సోదరి 6) అన్నదమ్ముల వివాహిత కుమార్తెలు 7) వివాహిత పౌత్రి (కొడుకు కూతురు) 8) మేనకోడలు 9) సోదరి భర్త 10) సోదరుని వివాహిత కుమార్తె ఈ పక్షిణీలన్నీ పరస్పరం పాటించాలి (చనిపోయిన వ్యక్తి అనుపనీతుడో, అవివాహిత బాలికో అయితే స్నానంతో శుద్ధి (షడశీతి, మార్కండేయ) పక్షిణీగాని, ద్విగుణపక్షిణీగాని 11వ రోజు ఉదయం దాటిన తరువాత పట్టవలసిన పనిలేదు.



**గమనిక** : పుత్రులు లేక దత్తత చేసుకుంటే ఆ దత్తుడు వాని పుత్రులుంటే పట్టవలసిన ఆశౌచాలన్నీ పట్టాలి.

**వివాహిత స్త్రీకి** : తల్లిదండ్రులు వారి సంతానము, అన్నదమ్ముల అక్క చెల్లెళ్ల సంతానం, తాత, మామ్మ, పినతల్లులు, పెదతల్లులు వారి సంతానము, మేనత్త ఆమె సంతానము. పినతండ్రి, పెదతండ్రి, వారి సంతానము, భర్త మేనల్లుడు (ఉపనీతుడైతే) భర్తయొక్క వివాహిత మేనకోడలు.

**వివాహిత స్త్రీకి పక్షిణీదార్లు కానివారు** : 1) పినతండ్రి పెదతండ్రుల భార్యలు 2) పినతల్లి పెదతల్లుల భర్తలు 3) మేనత్త భర్త 4) సవతితల్లి పిల్లలు 5) సవతితల్లి కుమారుని సంతానము 6) సవతితల్లి సోదరులు 7) పెనిమిటి సోదరుని వివాహిత కుమార్తె 8) తన సోదరుని భార్య 9) తన సోదరి భర్త వీరందరి విషయంలో స్నానంతో శుద్ధి.

**ఒకరోజు ఆశౌచం పట్టే సందర్భాలు** : 1) దత్తత వెళ్లిన వ్యక్తి తన (సహజ) అన్నదమ్ముల తాలూకు (భార్యవైపు కాని) పక్షిణీదార్లు చనిపోతే 1 రోజు ఆశౌచం పట్టాలి.

2) వివాహిత స్త్రీ తన సవతితల్లి విషయంలో (పరస్పరం)

3) ద్విగుణపక్షిణీదార్లు, పక్షిణీదార్లు దేశాంతర మరణం చెందుతే 1 రోజు ఆశౌచం (విష్ణుః)

4) అత్త మామలలో ఒకరు చనిపోయే సమయానికి వారి కుమార్తె అయిన తన భార్యగాని, ఆమె సంతానంగాని జీవించి లేకపోతే ఆ అల్లుడికి 1 రోజు ఆశౌచం (విష్ణుః)

5) సవతితల్లి యొక్క అక్క చెల్లెళ్లు, ఆమె అన్నదమ్ములు వారి సంతానము సన్నిధాన మరణం అయితే 1 రోజు (వేరే ఊళ్లో అయితే స్నానం) (అత్రి)

6) తన యింట్లో మగవాడెవరైనా చనిపోతే 1 రోజు ఉపసంపన్నాశౌచం చనిపోయిన వ్యక్తి శ్రోత్రియుడైతే 3 రోజులు (మనుః)

7) శవవాహకులకు 1 పూట (పగలైతే నక్షత్ర దర్శనం వరకు, రాత్రి అయితే తెల్లవారే వరకు) ఆశౌచం. తరువాత స్నానం చేసి యజ్ఞోపవీతం మార్చుకునే వరకు భోజనం చేయకూడదు. బంధుత్వరీత్యా ఆశౌచం పట్టేవారు శవవాహకులైతే వాహకాశౌచం పూర్తి అయ్యేదాకా భోజనం చెయ్యటం యుక్తం కాదని తోస్తుంది. అయితే శిశువు శవాన్ని తీసుకెళ్లినవారు వెంటనే స్నానం చేస్తే శుద్ధులు అవుతారు. యజ్ఞోపవీతం మార్చుకోవాలి.

**ఆశౌచములు కలియుట :** 10 రోజులు మైల పట్టుచుండగా 10 రోజుల పురుడుగాని, 10 రోజుల మైలగాని, అంతకన్న తక్కువ బలంగల ఆశౌచముగాని విన్నట్లయితే మొదటి మైలతో అన్నింటికీ శుద్ధి అవుతుంది. మైలలో ఉండి దహన సంస్కారం చేస్తే దహనానంతరం సపిండులకైతే 10 రోజులు, అన్యుల విషయంలో 3 రోజులు దహనాశౌచం ఉంటుంది. అయితే 10వ రోజు సూర్యాస్తమయం తరువాత మరొక మృతాశౌచం విన్నట్లయితే మొదటి మైలశుద్ధి అయిన పిమ్మట 2 రోజులు కాని యుక్తకాలం అయ్యేవరకు గాని మైల పట్టాలి. ఆ రాత్రి 3 జాములు దాటిన తరువాత రెండవ మృతాశౌచం వింటే రెండవ మైలను 3 రోజులు లేదా యుక్తకాలం వరకు పట్టాలి. 10 రోజుల పురుడులో మరొక 10 రోజుల పురుడు విన్నా పైవిధంగానే (అయితే రెండవ ఆశౌచం స్వంత కుటుంబానికి సంబంధించినదైతే మాత్రం పూర్తిగా పట్టవలసి ఉంటుంది.) (షడశీతి) దానిని వర్ధితాశౌచం అంటారు.

10 రోజులు పురుడు జరుగుతుండగా మరొక 10, 11 రోజుల మైలవార్త విన్నా, 3 రోజులు జాత లేక మృతాశౌచంలో 10 రోజుల పురుడు విన్నా, మొదటి ఆశౌచ శుద్ధిత స్నానం చేసి, రెండవదాని శేషం పట్టాలి.

10 రోజుల పురుడు పట్టుతుండగా 3 రోజుల మృతాశౌచంగాని, పక్షిణీ గాని వింటే (1) 10 రోజులలోగానే రెండవ ఆశౌచం శుద్ధి అయితే స్నానానంతరం మొదటి పురుడు మిగిలిన రోజులు పట్టాలి (2) 10 రోజులు దాటి రెండవ ఆశౌచ యుక్తకాలం సాగుతే, పురిటి శుద్ధితోనే రెండవదానికి శుద్ధి అవుతుంది.

వర్ధితాశౌచం పట్టుతూన్నప్పుడు మరొక మృతా శౌచం తెలిస్తే దాన్ని పూర్తిగా పట్టాలి. (షడశీతి)

## కొన్ని విశేషాంశాలు

1) ఆహితాగ్ని అయినవాడు మరణిస్తే దహనం అయ్యేవరకు బంధువులెవరికీ మైలగాని, పక్షిణీగాని మొదలు కాదు (అప్పటి నుంచే ఆశౌచ దినాలు లెక్కించాలి) ఈలోగా కుటుంబ సభ్యులుకాని జ్ఞాతులు శుభకార్యాలు కూడా చేసుకోవచ్చు (చంద్రిక)

2) సన్యాసి, యతి, వానప్రస్థుడు చనిపోతే ఎవరికీ ఆశౌచం ఉండదు. స్నానం ఆ దృష్టితో చేయకూడదు.

3) యతులకు, బ్రహ్మచారులకు సపిండుల మరణమందు ఆశౌచం లేదు. తల్లిదండ్రులు చనిపోయినప్పుడు మాత్రం వీరికి సచేల స్నానం తప్పదు. సమావర్తనం తరువాతి బ్రహ్మచర్య దశలో తల్లిదండ్రులు చనిపోతే 3 రోజులు ఆశౌచం పట్టి ఉదకదానం చెయ్యాలి. కర్మ చేస్తే మాత్రం పూర్ణాశౌచం ఉంటుంది (ధర్మసింధు)

4) ఆత్మహత్య చేసుకున్నవారు, మరణశిక్ష వల్ల మరణించినవారు, పరస్త్రీ సంపర్కంలో వారి భర్తలచే చంపబడినవారు, ఇతరులు వారించినా సాహసం చేసి నీళ్లలో దూకి ప్రమాదవశాత్తు చనిపోయినవారు, దొంగతనానికి కెళ్లి అక్కడ దెబ్బలు తిని గాని ప్రమాదవశాత్తుగాని మరణించినవారు, మహాపాతకులు-ఇటువంటి వారు చనిపోతే సపిండాదులకు ఆశౌచం లేదు. (ధర్మసింధు, విజ్ఞానేశ్వరీయము)

5) అస్థి సంచయనానికి పూర్వం పరామర్శకు శూద్రునింటికి వెళ్లిన ద్విజులు 3 రోజులు ఆశౌచం పట్టాలి. ద్విజుల ఇంటికైతే స్నానంతోసరి (ధర్మసింధు).

తల్లిదండ్రుల మరణమును అనేక సంవత్సరములు తరువాత విన్న అది మొదలు ఆశౌచము పడుతూ యథావిధిగా కర్మ చేయవలెను.

6) ఉపనయనము కాని దత్తుడు చనిపోతే దత్తత యిచ్చి పుచ్చుకొన్న యిరువంశములలోని తల్లిదండ్రులు, సోదరులు, మాతామహుడు, మాతామహి 3 రోజులు ఆశౌచము పట్టాలి. (స్మృత్యంతరే)

7) సగోత్రులుకాని సవతితల్లి బంధువుల మరణమందు సన్నిధానములో నున్న ఒక రోజు ఆశౌచము లేనిచో స్నానము (స్మృత్యంతరే)

8) ఉపనయనమైన కుమారుని మరణవార్త 10 రోజుల అయిన అనంతరము సంవత్సరములోపు విన్న తల్లిదండ్రులకు 3 రోజులు ఆశౌచము. కర్మ జరిగి సంవత్సరములోపు విన్న స్నానము మాత్రమే. కర్మ జరుగక సంవత్సరము తరువాత విన్న 3 రోజులాశౌచం ఆచరించి యథావిధిగా కర్మ చేయవలెను (ధర్మప్రవృత్తి)

9) భార్య మరణము భర్త, భర్త మరణము భార్య అనేక సంవత్సరములు గడిచాక విన్న తల్లిదండ్రులు మరణమందు కుమారునివలె ఒకరి మరణమందొకరు సంపూర్ణా శౌచమాచరించి యథావిధిగా కర్మ చేయవలెను. (ధర్మప్రవృత్తి)

10) కుమారులు లేని సవతితల్లి మరణము సంవత్సరములోగా విన్న పది రోజుల ఆశౌచము ఆచరించి కర్మ చేయవలెను. సంవత్సరము తరువాత విన్న 3 రోజులాశౌచము ఆచరించి కర్మ చేయవలెను (వరదరాజీయే)

11) తల్లిదండ్రులు వివాహమైన కుమార్తె మరణము 10 రోజులు దాటిన తరువాత విన్నా, అట్లానే తల్లిదండ్రుల మరణము వివాహమైన కుమార్తె విన్నా, అట్లానే సోదరుని మరణము సోదరి, మరియు సోదరి మరణము సోదరుడు 10 రోజుల అనంతరం విన్నా ఒక రోజు ఆశౌచము. ఇతరుల విషయంలో స్నానంతో శుద్ధి (ధర్మప్రవృత్తి)

12) ఇతరులు తనయింట చనిపోయి అక్కడే కర్మ చేస్తే ఆ యింటికి 10 రోజులు ఆశౌచము. వేరేచోట కర్మ చేస్తే స్నానమగు వరకు ఆ యింటికి ఆశౌచము.

13) రజస్వల (బహిష్టు) అయిన స్త్రీ అనారోగ్య కారణముగా ఆశౌచశుద్ధి స్నానము చేయకుండిన మరొక పుణ్యస్త్రీ అనారోగ్య స్త్రీని 10, 12 సార్లు

ముట్టుకొనుచూ స్నానము చేయుచు ప్రతిస్నానమునకు బట్టలు మార్చుకొని తిరిగి స్నానము జేసి ఆచమనము చేయుచుండవలెను. ఆఖరు సారి తడిబట్ట కట్టి తరువాత పొడిబట్ట కట్టి పుణ్యాహవచనము చేసిన శుద్ధురాలగును (ధర్మసింధు) పురుషుడు రోగముతో బాధపడుచున్న ఆశౌచశుద్ధికి మరొక పురుషుడు పైవిధముగా చేయాలి.

14) తల్లిదండ్రుల మరణంలో కుమారుడు 10 రోజులు దాటిన తరువాత కర్మ ప్రారంభిస్తే అంతకుముందు ఆశౌచం పట్టని సపిండులు 3 రోజులు ఆశౌచం పట్టాలి.

15) తల్లిదండ్రులలో ఎవరిదైనా ఆచూకీ 15 సం॥లు తెలియకపోతే మృతి చెందినట్లు భావించి పుత్రులు కర్మ చేయాలి. అప్పుడు సపిండులు ఆ పది రోజులు మైల పట్టాలి. 12 సం॥ ఆచూకీ తెలియని సపిండులకు ఒకరు కర్త అయి 3 రోజులు కర్మ చేసిన సందర్భంలో మృతుని సపిండులకు కూడా 3 రోజులు ఆశౌచం.

**ఏటిసూతకము :** కర్మ చేసినవారికి మృతతిథి లగాయతు 1) తల్లిదండ్రులైతే 1 సంవత్సరము 2) సవతి తల్లి అయితే 6 నెలలు 3) భార్య అయితే 3 నెలలు 4) కుమారుడైతే 3 పక్షములు 5) ఇతర సపిండులైతే 1 నెల సూతకం ఉంటుంది. ఈ కాలంలో శుభకార్యాలు, దేవాలయ ప్రవేశం, పూజలు వంటివి ఆచరించకూడదు. కాని నిత్యపూజలు చేసుకోవచ్చు.



ఏటిసూతకము అనంతరము ప్రతి సంవత్సరము వారు మరణించిన తిథియందు ఆబ్దికమును తప్పనిసరిగా నిర్వర్తించవలెను. పిదప పితృదేవతల తృప్తికై మహాలాయ పక్షములందును, వివిధ నదుల పుష్కర సమయములందును, మకర, కర్కాట మొదలైన సంక్రమణముల ప్రవేశములయందును, దక్షిణాయన, ఉత్తరాయణ ప్రారంభ సమయములయందును, గయా, బదరీవంటి పవిత్ర తీర్థములయందు శ్రాద్ధ విధిని ఆచరించిన పితరులు ఉత్తమగతినంది తృప్తులగుదురు. విధివిధానముగా జరుపవలసిన క్రియాకలాపములను నిర్వర్తించినచో వారు సంతృప్తి చెంది మనవంశ వృద్ధికై వారి ఆశీస్సులను అందజేయగలరని పూర్వీకులు అనేక పురాణములలో తెలియజేసియున్నారు. కావున శక్త్యానుసారముగా పై కార్యక్రమములను నిర్వహింపవలెను.

# అపర ప్రకరణము

## శ్రాద్ధకర్తలు

ఎవరైనా చనిపోతే వారికి కర్మ జరిపి, తరువాత మాసికాలు, తద్దినాలు వారికి ఎవరు ఆచరించాలో వారిని శ్రాద్ధకర్త లేదా కర్త అంటారు. కర్తను ఎలా నిర్ణయించాలో ఇప్పుడు తెలుసుకుందాము.

1. చనిపోయిన వ్యక్తికి కొడుకులు (ఔరసపుత్రులు) ఉంటే వారందరూ కర్తలే. వారంతా కలిసిగాని, విడివిడిగా గాని తద్దినాలు పెట్టాలి. ప్రతి పురుషుడూ తాను జీవించినంతకాలం చనిపోయిన తలిదండ్రులకు తద్దినాలు పెట్టాలి. ఇది విధ్యుక్త ధర్మం. చనిపోయిన వ్యక్తికి పుత్రులు పెట్టే తద్దినాలద్వారాను, వారి అనంతరం పౌత్రులు పెట్టే తద్దినాలలో (రుద్రరూపంగా)ను, తదనంతరం ప్రపౌత్రులు (మునిమనమలు) పెట్టే తద్దినాలలో (ఆదిత్యరూపంగాను) పిండ, తిలోదకాలు వగైరా లభిస్తాయి. తద్దినాలు కలిసి పెట్టినా విడివిడిగా పెట్టినా అపరకర్మ మాత్రం సోదరులంతా కలిసే జరపాలి. (విభక్తులైనా కాకపోయినా) ఇందులో జ్యేష్ఠుడు ముఖ్యకర్త, మిగిలినవారు సహాయకులు. వయసులో పెద్దవాడే జ్యేష్ఠుడు (పెద్ద భార్యయొక్క ప్రధమపుత్రుడే చిన్నవాడైనా జ్యేష్ఠుడని కొందరి మతం) అయితే కవలల్లో మాత్రం మొదట పుట్టిన వానికన్న తరువాత పుట్టినవాడే జ్యేష్ఠుడు అని విష్ణుపురాణంలో ఉన్నది.

2. స్త్రీ చనిపోయేటప్పటికి పుత్రులు లేకపోతే సవతికొడుకులలో జ్యేష్ఠుడు కర్త అవుతాడు. అతని తరువాత క్రమంగా అతని తమ్ములు కర్తలౌతారు. అప్పటికి సవతికొడుకులు లేకపోయినా తరువాత ఆమె భర్త పునర్వివాహం చేసుకుని కొడుకుని కంటే ఆ కొడుకు, అతని అనంతరం అతని తమ్ములు కర్తలౌతారు సవతి కొడుకు కర్త అయినప్పటికీ తండ్రితో విభక్తుడై, తండ్రి బతికి ఉంటే ఆ తండ్రే (ప్రతినిధిగా) కర్మ చెయ్యాలి. అయితే ఇటువంటి స్త్రీకి తరువాతి తరాలలో రుద్రరూపంగాను, ఆదిత్యరూపంగాను ఏమీ లభించదు.

3. ఎవరైనా చనిపోయే సమయానికి ముందే పుత్రులంతా చనిపోయి, మనుమలు (పౌత్రులు) ఉంటే ఆ మనుమలలో జ్యేష్ఠుడు కర్త అవుతాడు. మనుమలు కూడా చనిపోయి ఉంటే మునిమనుమలలో జ్యేష్ఠుడు కర్త అవుతాడు.

4. పుత్రులు లేనివారు దత్తత చేసుకుంటే దత్తపుత్రుడు కర్త అవుతాడు. అతడు ముందే చనిపోతే అతని కొడుకుకు (మనుమడు) 3లో లాగానే కర్తృత్వం సంక్రమిస్తుంది. భార్యాభర్తలు ఇద్దరూ జీవించి ఉండగాగాని, వారిలో ఒకరి మరణానంతరం రెండవవారుగాని దత్తత చేసుకోవచ్చు. సగోత్రుడిని ఐతే ఉత్తమం. దత్తపుత్రుడి పుత్రపౌత్రులనుంచి కూడా పిండతర్పణాలు (సొంత మనవడు, మునిమనవడు నుంచిలాగా) లభిస్తాయి. ముందు ముందు చెప్పే కర్తలంతా ఒకతరం కర్తలే. వారి పుత్రపౌత్రులనుంచి ఏమీ లభించదు. దత్తత చేసుకున్నాక పుత్రసంతానం కలుగుతే ఈ దత్తుడు జ్యేష్ఠుడు కాడు. ఔరసపుత్రులలో జ్యేష్ఠుడే ముఖ్యకర్త.

5. పుత్రులు లేనివారు దత్తత చేసుకోకపోయినా, దత్తపుత్రుడు నిస్సంతువుగా మరణించినా దౌహిత్రులలో ఒకడు కర్త అవుతాడు. ఈ దౌహిత్రులు మూడు రకాలు. పుత్ర సంతానంలేనివాడు కన్యాదానం చేసేటప్పుడు అల్లుడితో

"అపుత్రోహం ప్రదాస్యామి తుభ్యం కన్యాం భవానపి ।

పుత్రార్థీచే దిహోత్పన్న స్సనౌపుత్రోభవేదితి"

(కొడుకులు లేని నేను నీకు ఈ కన్యను ఇస్తున్నాను. మీకుమారుడు మన ఉభయులకు కొడుకు కాగలడు) అని చెప్పి వుంటే ఆ దంపతులకు పుట్టిన కుమారుడు ఈ దౌహిత్రులలో ప్రధానుడు. ఇట్టి దౌహిత్రుడిని ద్వ్యాముష్యాయనుడు అంటారు. పై నాలుగు రకాల కర్తలు లేనప్పుడు ఇతడే కర్త అవుతాడు. ఇతనికి విధాయకం కూడా. మాతామహుడు చనిపోయే సమయానికి తనతండ్రి జీవించి ఉంటే అతని అనుజ్ఞతో మాతామహుని కర్మ చేయవచ్చును. ద్వ్యాముష్యాయనుడు, దత్తపుత్రుడు కూడా ఉంటే (కన్యాదానంలో ద్వ్యాముష్యాయనుడికి అధికారం ఇచ్చి తరువాత దత్తత చేసుకుంటే) ద్వ్యాముష్యాయనుడే కర్త అవుతాడు. ఈలోగా దత్తుడు చనిపోతే అతని పుత్రులద్వారా దత్తత తీసుకున్న వానికి రుద్రరూపంలో పిండప్రదానం జరుగుతుంది.

6. పై రకాలలో కర్తలు లేకుంటే ఆస్తిని (మొత్తంగాని, హెచ్చు భాగాన్ని గాని) పొందిన దౌహిత్రుడు (ధనహారి దౌహిత్రుడు) కర్త అవుతాడు. ఇతనికి విధాయకం.

7. పైరకాల కర్తలు లేకుంటే దౌహిత్రులలో ఎవరైనా ధర్మబుద్ధితో కర్త కావచ్చును. కాని విధాయకం కాదు. అంటే దౌహిత్రులెవరూ కర్మ చెయ్యకపోయినా దోషం లేదన్నమాట.

**గమనిక :** పితృమేధసారంలో కర్తల క్రమంలో పుత్రః, సపత్నీ పుత్రః, పుత్రికా పుత్రః, దత్తః అని దత్తపుత్రుని కంటే ద్వ్యాముష్యాయనుడికి అధిక ప్రాధాన్యం ఇచ్చారు. కాని, దత్తపుత్రుని అనంతరం అతని పుత్రపౌత్రులద్వారా (రుద్ర, ఆదిత్య రూపాలలో) పిండ తర్పణాలు లభిస్తాయి కాని, ద్వ్యాముష్యాయనుడి విషయంలో అతనితో ఆఖరు కాబట్టి ద్వ్యాముష్యాయనుడి కంటే దత్తపుత్రుడే శ్రేష్ఠమని తోస్తున్నది.

8. పై ఏడు విధాల కర్తలు లేనప్పుడు జీవిత భాగస్వామి కర్త. జీవిత భాగస్వామి ముందే మరణిస్తే

9. కుమార్తె, ఆమెకూడా లేకపోతే పురుషునికి (స్త్రీ విషయంలో దిగువ బంధుత్వాలన్నీ ఆమె భర్తకు సంబంధించి గ్రహించాలి)

10. సోదరుడు సోదరులలో తమ్ముడు ప్రధానుడు. బతికున్న తమ్ముళ్లలో పెద్దవాడు. తమ్ముళ్లెవరూ (బతికి) లేకపోతే బతికున్న అన్నలలో చిన్నవాడు. సోదరులెవరూ బతికుండకపోతే

11. సోదరపుత్రుడు. వీరెవ్వరూ లేకుంటే

12. సవతి సోదరుడు. అతడు చనిపోయి ఉంటే

13. సవతి సోదరుని పుత్రుడు. వీరెవ్వరూ లేకపోతే

14. తండ్రి (బతికుంటే). తండ్రి కూడా లేకపోతే

15. తల్లి. ఆమెకూడా లేకపోతే

16. కోడలు. కోడలు లేకపోతే

17. సోదరి. సోదరి చనిపోయి వుంటే

18. మేనల్లుడు. వీరెవ్వరూ లేకపోతే

19. సపిండుడెవరైనా కర్తృత్వం వహించవచ్చు (ధర్మబుద్ధితో) సపిండులెవ్వరూ దొరకకపోతే

20. సమానోదకులు గాని, సగోత్రులు గాని, తదితరులుగాని ధర్మబుద్ధితో చెయ్యవచ్చు. (వెంకట సోమయాజీయము పుట 223)

## భూశయనము

చాలా సందర్భాలలో వ్యక్తి చనిపోయే సమయం దగ్గర పడినప్పుడు అక్కడ ఉన్న కుటుంబ సభ్యులకు తెలుస్తుంది. అలా తెలిసినపుడు శుభ్రమైన నేలమీద దక్షిణం కొనలుగా దర్భలు పరిచి ఆ వ్యక్తిని దక్షిణ శిరస్సుగా వెల్లకిలా పడుకోపెట్టాలి. దీనినే భూశయనం అంటారు. శక్తిని బట్టి సువర్ణ, భూ, తిల, గోదానాలు చెయ్యవచ్చు. ముఖ్యంగా ఆ వ్యక్తి కుడిచెవిలో (స్త్రీకి ఎడమచెవిలో) కర్ణ మంత్రజపం చెయ్యాలి. "ఆయుషః ప్రాణగ్ం సంతను, దివస్సు వస్సంతను" అని వినిపించాలి. చనిపోయే వ్యక్తి బ్రహ్మవేత్త అయితే "బ్రహ్మవిదాప్నోతిపరం తదప్యేషశ్లోకోభవతి, భృగుర్వైవారుణి, సతపస్తప్త్వా" అని జపించాలి. ఈ మంత్రాలు అక్కడ ఉన్నవారికి తెలియనప్పుడు "నారాయణ" జపం చెయ్యటం ఆచారంగా వస్తూంది. తులసి తీర్థం నోట్లో పొయ్యటంకూడా మంచిదే వస్తుంది. ఇవన్నీకూడా చనిపోయిన వ్యక్తి పుణ్యలోకాలకు వెళ్లేందుకు సాయపడే సాధనాలుగా భావిస్తారు.

మరణించినట్లు తొందరపడి నిర్ణయించకూడదు. నిస్సందేహంగా మరణం నిర్ధారణ కాగానే, కాళ్లు రెండు దగ్గర చేర్చి రెండు బొటనవ్రేళ్లు కలిపి తాడుతో జారుముడి వెయ్యాలి. చేతిబొటన వ్రేళ్లను దగ్గరకు చేర్చి గుండె కింది భాగంలో ఆ వేళ్లనుంచి తాడుతో జారుముడి వెయ్యాలి. కనురెప్పలు మూయాలి. చనిపోయిన తర్వాతనే తెలిసినా, మరొకచోటనుండి శవం ఇంటివద్దకు వచ్చినా, దక్షిణశిరస్సు దర్భలపైవెల్లకిలా పరుండబెట్టి కాళ్లకు చేతివేళ్లకు పై చెప్పిన విధంగా ముడులు వేసి కనురెప్పలు మూయాలి. శవంవద్ద కూడా పుత్రాదులు గోదానాదిదానాలు చెయ్యవచ్చు. శవం తలవద్ద కుందెలో నూనెవేసి పత్తి వత్తితో దీపం ఉంచాలి.

**గమనిక :** శైవుల విషయంలో శవాన్ని గోడకానించి కూర్చోబెట్టాలి. పాడె బదులు శవాన్ని కూర్చోబెట్టి తీసుకెళ్లే విధంగా కర్రలతో తయారుచేస్తారు. వీరికి దహనం ఉండదు. దానికి బదులు ఖననం చేస్తారు.

## శవస్నానము, ప్రాయశ్చిత్తము

ఉదయం చనిపోతే కర్త భోజనం చేయకుండానే స్నానం చేసి తడిబట్టలతోనే కర్మ ప్రారంభించాలి. చనిపోయే సమయానికి కర్త భోజనం అయిపోతే కర్త తిరిగే స్నానం చేసి కర్మ ప్రారంభించాలి. తెల్లవస్త్రాలు ధరించి కర్మ చెయ్యాలి. మరణ సమయానికి సాయంకాలమై శవదహనానికి వ్యవధి లేకపోయినా, కర్త గ్రామాంతరం నుంచి రావటం ఆలస్యం అయినా మరునాటి వరకు ఆగవచ్చు. అయితే సన్నిధినున్న కర్తలు, ఇతర కుటుంబ సభ్యులు వెంటనే స్నానం చెయ్యాలి. వీలైనంతవరకు ఆ రోజే కర్మ ప్రారంభించటానికి ప్రయత్నించాలి. కర్త రావటం మరునాటికి కూడా వీలుకాదని తెలుస్తే ఎవరు దహన సంస్కారం చేస్తారో వారు కర్మ ప్రారంభించాలి.

ముందుగా శవానికి నీటితో స్నానం చేయించాలి. ఆ నీటిలో లభ్యమైతే గంగ నీరు కలపవచ్చు. తరువాత పంచగవ్యాలతో (ఆవుపాలు, ఆవుపెరుగు, ఆవునెయ్యి, ఆవుమూత్రం, ఆవుపేడ) స్నానం చేయించాలి. ఇది కర్మ మరుసటిరోజు ప్రారంభించే సందర్భంలో మాత్రమేనని కొందరి అభిప్రాయం.



స్నానం చేయించిన తరువాత ప్రాయశ్చిత్తం జరపాలి. ఇది పురుషులకు, పుణ్య స్త్రీలకు, వితంతువులకు వేరువేరుగా ఉంటుంది. ఈ సాధారణ ప్రాయశ్చిత్తం కాక దుష్టతిథి, వార, నక్షత్రాలలో చనిపోయినా, ద్విపుష్కర త్రిపుష్కరాలలో చనిపోయినా, చనిపోయిన వ్యక్తి గర్భిణీ స్త్రీ అయినా, పురిటాలు అయినా, దుర్మరణమైనా ఆ దోషం పరిహరించేందుకు ప్రత్యేక ప్రాయశ్చిత్తాలున్నాయి. కొన్ని సందర్భాలలో హోమాలూ, కొన్ని సందర్భాలలో దానాలు చెప్పబడినాయి.

విదియ, సప్తమి, ద్వాదశి తిథులను భద్రతిథులంటారు. కృత్తిక, పునర్వసు, ఉత్తర, విశాఖ, ఉత్తరాషాఢ, పూర్వాభాద్ర నక్షత్రాలను త్రిపాది నక్షత్రాలంటారు. (వీటిలో 3 పాదాలొక రాశిలోను, ఒక పాదం మరొక రాశిలోను ఉంటాయి) భద్ర తిథి, త్రిపాది నక్షత్రం, మంగళ లేక శుక్రవారం కలిసినప్పుడు మృతిగాని, దహనంగాని జరిగితే మూడు మరణాలు సంభవిస్తాయని ఒక నమ్మకం. అందుచేత శాంతికోసం ధన దానం వంటి దానాలు చెయ్యాలి. భద్రతిథిలో మరణం సంభవిస్తే భూదానం, త్రిపాది నక్షత్రంలో అయితే సువర్ణదానం, దుష్టవారం అయితే వస్త్రదానం చెయ్యాలి.

నందతిథులు (పాడ్యమి, షష్ఠి, ఏకాదశి) రిక్తతిథులు (చవితి, నవమి, చతుర్దశి) వీటిలో చనిపోతే ధాన్య దానం చెయ్యాలి. ద్విపాద నక్షత్రం (మృగశిర, చిత్త, ధనిష్ఠ)లో చనిపోతే గోదానం చెయ్యాలి. ధనిష్ఠా పంచకం (ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి)లో చనిపోతే శవం ముఖమందు పంచరత్నాలనుంచి కర్త దానికి సంబంధించిన హోమాలు చెయ్యాలి. దహనం కోసం తీసుకెళ్లవలసిన అగ్నిని (అగ్నివివరాలు దహనశీర్షికలో ఉన్నాయి) శవం తలవైపున కొంతదూరంలో ప్రతిష్ఠించి ఆ అగ్నిలోనే ప్రాయశ్చిత్త హోమాలు చెయాలి. ఆ అగ్నిలోనే కొంచెం అన్నం (చెరువు) వండి ఆ అన్నం పాత్రను కూడా శవయాత్రలో తీసుకెళ్లాలి. దహనాగ్నిని ఒకకుండలో ఉంచి, శవంతోపాటు కర్త తీసుకువెళ్లాలి.

ఇంటిలో కాక వేరొకచోట మరణించినప్పుడు మరణం సంభవించిన పద్ధతిని బట్టి, ప్రాయశ్చిత్తం జరపాలి. అట్లాగే మంచంమీదనే మరణించిన వారి విషయంలో కూడా.

**ఇంటిలో మరణిస్తే ఇల్లు వదలడం :** ఇంటిలో మరణం సంభవిస్తే మృతి చెందిన నక్షత్రాన్ని బట్టి 1) ద్విపాది నక్షత్రమైతే 3 నెలలు 2) త్రిపాది నక్షత్రమైతే 4 నెలలు 3) ధనిష్ఠా పంచకాలలోనిదైతే 6 నెలలు ఆ ఇంటిని వదలిపెట్టాలి. ధనిష్ఠకు 6 నెలలు, శతభిషానికి 3 నెలలు, పూర్వాభాద్రకు 3 పక్షాలు, ఉత్తరాభాద్రకు 1 నెల, రేవతికి 1 పక్షం అని కొందరి మతం. ఏ నక్షత్రంలో ఇంటిలో మరణం సంభవిస్తే ఎంత కాలం ఇల్లు వదలిపెట్టాలో నిర్ణయించడానికి కొందరు మృతచక్ర పద్ధతిని అనుసరిస్తారు. ఈ వివరాలు పంచాంగంలో ఉంటాయి.



## శవయాత్ర

మేడికర్రతో కట్టిన ఆసంది (పాడె) మీద (ఇప్పుడు వెదురు వాడుతున్నారు) పైన వెల్లకిలా శవాన్ని దక్షిణశిరస్సుగా పడుకోబెట్టాలి. ఈ పాడెకి కర్రలతో అడ్డంగా ఏడుకట్లు ఉంటాయి. శవాన్ని తీసుకొని వెళ్లేటప్పుడు తలవైపు ముందుకు ఉండాలి. శవానికి ముందు పెద్దలు. వారి వెనక బంధువులు ఉత్తరీయాలు లేకుండా జుట్టుముడి విప్పి వెళ్లాలి. అగ్నికి (కర్త అగ్నిని మోస్తాడు), పాడెకు మధ్య కర్తలు తప్ప మరెవ్వరూ ఉండకూడదు. శవాన్ని మోసే వాహకులు నివీతిగా ఉండాలి. నలుగురు

వాహకులుండాలి. ఒకరికన్న ఎక్కువ కుమారులున్నపుడు ప్రధానకర్త కాక తక్కిన కుమారులలో ఎవరైనా వాహకులుగా వెళ్లవచ్చు. శవం ముఖంమీద చింపని వస్త్రాన్ని (యజుశ్శాఖీయులు) కప్పాలి (ఋగ్వేదులైతే చింపిన వస్త్రం కప్పవచ్చు) ఆహితాగ్ని అయితే పాడెపై కృష్ణాజినం పరిచి (కృష్ణాజినం శిరస్సు మృతుని తలవైపు ఉండాలి) దానిపై శవాన్ని ఉంచి, తలనుంచి పాదాలదాకా వస్త్రంతో కప్పాలి. ఇంటినుంచి శవం బయలుదేరగానే, ఆ స్థలాన్ని శుభ్రం చేసి, ఇంట్లో ఉన్న కుటుంబ సభ్యులంతా స్నానం చెయ్యాలి. అంతవరకు ఇంటిలో వంట చెయ్యకూడదు.

మార్గమధ్యంలో శవాన్ని మూడుసార్లు దింపి ప్రతిసారి శవంతోపాటు తెచ్చిన పాత్రలోని అన్నాన్ని అగ్నిహోత్రం ముందుగా ఉంచి, ఆ అన్నాన్ని కర్త ఎడమకాలు మడచి దక్షిణముఖంగా ఉండి పిండంగా చేసి నేలపై ఉంచి తిలోదకం ఇవ్వాలి.

గ్రామానికి, శ్మశానానికి మధ్య అగ్నిహోత్రం మొత్తం నేలమీద పడితే దానికి ప్రాయశ్చిత్తం చేసి తిరిగి కర్మ చెయ్యాలి. అగ్నిలో కొంతభాగం పడితే దాన్ని పైకి తీసి అగ్నితో చేర్చి తీసుకువెళ్లవచ్చు.



## దహనము

నాలుగు వర్ణాలవారి విషయంలోను శవానికి దహనమే విధించబడింది. శిశువులకు, యతులకు మాత్రం ఖననం విధించబడింది.

దహనానికి ఉపయోగించే అగ్ని వేరు వేరుగా ఉంటుంది.

**శూద్రులకు** : వారి ఇంటిలోని అగ్ని (గృహ్యాగ్ని)

**వైశ్యులకు** : పర్వతాగ్ని

**క్షత్రియులకు** : అడవిలోని అగ్ని (అరణ్యాగ్ని)

**బ్రాహ్మణులకు** : గృహస్థులకు ఔపాసనాగ్ని, ఆహితాగ్ని అయితే మంథనాగ్ని బ్రహ్మచారులకు కపాలాగ్ని, ఉపనయనం కాని వారికి కన్యలకు తుషాగ్ని, విధవకు, భార్య చనిపోయిన పురుషునకు ఉత్తపనాగ్ని వాడాలి.

**తుషాగ్ని** : ఊకను వెలిగించగా ఏర్పడిన అగ్ని.

**ఉత్తపనాగ్ని :** దర్భముష్టికి అగ్ని ముట్టించి, మండించి మరొక దర్భ ముష్టిచేత జ్వాలనికల్పించి ఆ జ్వాలలో మూడవ దర్భ ముష్టిని వెలిగించగా ఏర్పడే అగ్ని

**కపాలాగ్ని :** కుండపెంకును మంటలో కాల్చి, దానిమీద ఆవుపేడ పిడకగాని బరిహస్సుగాని, పత్తిగాని, నూనెగాని ఉంచగా ఏర్పడిన అగ్ని.

**మంథనాగ్ని :** అరణితో మథించిన అగ్ని (ఆహితాగ్నిని యజ్ఞపాత్రలతో త్రేతాగ్నులచే దహించాలని ఆపస్తంబుని మతము) భార్యాభర్తలలో తరువాత మరణించిన వారికి విదురౌపాసన చేసి దహన సంస్కారం జరపాలి.

ఏ కారణం చేతనైనా మృతదేహంకాని, అస్థికలుగాని దొరకకపోతే పాలాశదహనం చెయ్యాలి అంటే మోదుగ సమిధలతో శరీరాకృతి కల్పించి ఆ ఆకృతికి దహన సంస్కారం జరపాలి. ఇందులో శిరస్సుకు 40, మెడకు 10, ఛాతీకి 30, పొట్టకు 20, రెండు చేతులకు 100, చేతివేళ్లకు 10, వృషణాలకు 6, శిశ్నానికి 4, రెండు తొడలకు 100, మోకాళ్లు పిక్కలకు 30, కాలివేళ్లకు 10 సమిధలను పేర్చి, దర్భలతోగాని మోదుగ తాళ్లతోగాని కట్టి దానినే శవంగా భావించి దహనసంస్కారం చెయ్యాలి. శ్మశానానికి చేరిన తర్వాత శ్మశానికి ఆగ్నేయదిక్కున గాని నైరుతి దిక్కున గాని దహన ప్రదేశాన్ని ఏర్పాటు చేసుకోవాలి. ముళ్లు, చెట్లు, ఓషధులు వంటి వాటిని తొలగించి ఉత్తర దక్షిణాలుగా 5 మూరలు పొడవు, 12 అంగుళాలు లోతుగా గొయ్యి తవ్వి అందులో దక్షిణం కొసలుగా దర్భలుంచి నువ్వులు చల్లివాటిపై సమిధలు పరచి చితి ఏర్పరచి మొలతాడు, జందెం, శవం వేళ్లకు కట్టిన తాళ్లు విప్పి వెయ్యాలి. శవమును చితిపై వెల్లకిల దక్షిణశిరస్సుగా పరుండబెట్టి గుండెపైన ఇంటివద్ద నుంచి తెచ్చిన అగ్ని నుంచి సమంత్రకంగా హోమాలు చెయ్యాలి. ఈ అగ్నిలోనే శరీరం దహనం అవుతుంది. ఈ అగ్నినే శిరస్సువద్ద అమంత్రకంగా ముట్టించడం ఆచారంగా వస్తుంది. కొత్తకుండలో నీరు తీసుకుని కర్త చితిచుట్టూ 3 ప్రదక్షిణాలు చెయ్యాలి. ప్రతిప్రదక్షిణానికి కుండకి ఒక చిల్లు చెయ్యాలి. 3 ప్రదక్షిణాల తరువాత వెనక్కి చూడకుండా కుండను పారవేసి ముందుకు పోవాలి. తిరిగి కర్త సంచయనందాకా అక్కడికి రాకూడదు. నగ్నంగా దహనం చెయ్యకూడదు. మర్మస్థానాన్ని కొందరు పిడకలతో కప్పుతున్నారు. అది సరికాదు. చిన్న వస్త్రంతోనైనా

కప్పి దహనం చెయ్యాలి. మృతి సమయంలో ధరించిన వస్త్రంలో కొంతభాగంతో కప్పాలని వ్యాఘ్రపాదులు అన్నారు. చితిలో ఒక శవాన్ని దహనం చేసిన అగ్నిలో మరొక శవాన్ని దహనం చెయ్యకూడదు (భర్త చితిలోని అగ్ని ఆరకమునుపు భార్య చనిపోతే మాత్రం ఆమె శవాన్ని ఆ చితిలోనే దహించాలి)

చితిమధ్యలో తులసికాష్ఠముంచి దహనం చేస్తే కోటిపాపాలు చేసిన వారికి కూడా పాపవిముక్తి కలుగుతుంది. చితి బాగా మండటంకోసం ఆవునెయ్యి, కర్పూరం వాడవచ్చు. కిరసనాయిలు వాడకూడదు. దహన సమయంలో శవం నవ్వినా, ఏడ్చినా, ఆవలించినా, లేచినా కంపించినా అరిష్టంగా భావిస్తారు.

3 సం॥ దాటి ఉపనయనం కాకుండా చనిపోయిన వాడికి అమంత్రకంగా దహనం చేసి దర్భలపై తిలోదక పిండ ప్రదానాలు చెయ్యాలి. ఖననం చేసిన సందర్భంలో భూమిలోనే పిండం ఉంచాలి. నాలుగోరోజున భోజనాలు పెట్టాలి.

**వపనము :** శవానికి అగ్ని ముట్టించిన తరువాత కర్త అటు చూడకుండా శ్మశానంలో వేరేచోట కూర్చోవాలి. కపాలమోక్షం అయినట్లు తెలిశాక వపనం చేయించుకోవాలి. తల్లిదండ్రుల కర్మ చేసే పుత్రుడు కపాలమోక్షం వేళకు రాత్రి అయినా రెండుజాములలోపైతే అప్పుడే వపనం చేయించుకోవాలి. అర్ధరాత్రి దాటితే మరునాడు ఉదయం చేయించుకోవాలి. తల్లిదండ్రులకు పుత్రుడు కర్మచేసేటప్పుడు వపనానికి వారం పట్టింపులేదు. భార్య గర్భిణి అయినా వపనంవిధిగా చేయించుకోవాలి. మరొకరి కర్మ విషయంలో అయితే రాత్రిపూటగాని, శుక్రవారంనాడుగాని వపనం చేయించుకోకూడదు. మరునాడు చేయించుకోవాలి. కర్త మరణించిన వ్యక్తి పెద్ద అయినా, మరణించిన స్త్రీ భర్త పెద్దవారయినా కర్త వపనం చేయించుకోవాలి. కర్త అనుపనీతుడైనా లేదా తండ్రి బతికివున్నా వేరొక ప్రతినిధికర్మ చేస్తున్నప్పటికీ, చిన్నవాడైన కర్త వపనం చేయించుకోవాలి. కాకపోతే చేయించుకోకూడదు. అంతేకాక తల్లిదండ్రులలో ఒకరు మరణించిన సంవత్సరంలోపుగా రెండవవారుగాని, తాను కర్మ చెయ్యవలసిన మరొకరుగాని మరణిస్తే వారి కర్మ విషయంలో కూడా వపనం చేయించుకోకూడదు.

వపనం అంటే తల, గడ్డం, మీసం (మెడపైభాగంలోని వెంట్రుకలు) గీయించుకోవటం.

## అస్థి సంచయనము, నిమజ్జనము

మరణదినం నుంచి 4వ రోజున బ్రాహ్మణులకు, 5వ రోజున క్షత్రియులకు, 7వ రోజున వైశ్యులకు, 9వ రోజున శూద్రులకు అస్థిసంచయనం జరపాలి. అంటే చితిలోని ఎముక ముక్కలను సేకరించడం అన్నమాట. వరుసగా 2, 3, 5, 7వ రోజులలో జరపవచ్చునని ఆపస్తంబులు చెప్పారు. ధర్మసింధులో దహనదినం నుంచి 1, 2, 3, 4, 7, 9వ రోజులలో ఎప్పుడైనా చేయవచ్చునని ద్విపాద, త్రిపాద నక్షత్రాలు, కర్త జన్మనక్షత్రం, ఆది, మంగళ, శనివారాలు కాకుండా చెయ్యాలని ఉన్నది. ఉదయ కాలంలో జరపటం చాలాముఖ్యం. 10 రోజులు గడిచాక కర్మ ప్రారంభించే సందర్భంలో దొరికితే అస్థికలు తెచ్చి మంత్ర పూర్వకంగా దహనం చేసి వెంటనే సంచయనం చెయ్యాలి. శవంగాని, అస్థికలుగాని కర్తకు దొరకకపోతే పాలాశదహనం జరిపి ఆ భస్మాన్నే అస్థికలుగా భావించి సంచయనం చెయ్యాలి.

భస్మం నుంచి అస్థికలను వేరుచేసి నేతితోను, పంచగవ్యంతోను, సుగంధోదకంతోను తడిపి, ఒక కుండ పిడతలో ఉంచి, కొత్తవస్త్రంతో చుట్టి, పవిత్ర ప్రదేశంలో పాతిపెట్టాలి. ఇంటిలో ఉంచకూడదు. వీలైనంత త్వరలో వాటిని కృష్ణాజినం, పట్టుబట్ట వంటి వాటితో చుట్టి గంగానదిలోగాని, మరొక జీవనదిలోగాని మంత్రపూర్వకంగా నిమజ్జనం చెయ్యాలి. మానవుని అస్థికలు గంగాజలంలో ఎన్ని నాళ్లుంటాయో అన్ని వేల సంవత్సరాలు అతడు స్వర్గలోకంలో ఉంటాడని మన విశ్వాసం. కృష్ణాష్టమినాడు పితృతీర్థంలో అస్థికలను కలిపి సూర్యుడికి నమస్కరిస్తే, ఆ పితృదేవతలు బ్రహ్మలోకం చేరుకుంటారని బ్రహ్మపురాణంలో వున్నది. ఆధానయాజి అస్థికలను శమీవృక్ష (జమ్మిచెట్టు) మూలంలో పాతిపెట్టాలని, సోమయాజి అస్థికలను మరల దహనం చెయ్యాలని చయనం చేసినవారి అస్థికలను లోష్టచయనం చెయ్యాలని కాత్యాయనులు చెప్పారు. మరణించిన పదిరోజులలోగా ఎవరి అస్థికలు గంగలో కలపబడతాయో వారికి గంగా తీరంలో మరణించిన పుణ్యం లభిస్తుంది. సంచయనం తర్వాత నిమజ్జనంలోపల గ్రహణము, సంక్రమణము సంభవించకూడదు. ఎట్టి పరిస్థితులలోను నిమజ్జనం మొదటి సంవత్సరంలోనే జరగాలి. బేసి నెలలలో ఏ రోజునైనా పగలు నిమజ్జనం చెయ్యాలి?

## నిత్యకర్మ

శవయాత్రకు ముందే, ఆ శవానికి కప్పిన వస్త్రంలో నుంచి ఒక పీలికను తీసి, యజ్ఞోపవీతం అంత పొడవు ఉండేటట్లు ముడివేసి దానిని రోజూ కర్మచేసే సమయంలో కర్త ధరించాలి. దీనిని వాససు అంటారు. అంతేకాక స్మశానంలో ఉన్న ఒక చిన్నరాయిని (ఉసిరికాయంత పరిమాణంలో) కూడా నిత్యకర్మలో ఉపయోగిస్తారు. దీనిని శిల అంటారు. ఈ శిల ఎరుపు, తెలుపు రంగుల్లో ఉంటే ఉత్తమం. అనేక రంగులుండటంగాని, నల్లగా ఉండటంగాని పనికిరాదు. నిత్యకర్మలో భాగంగా తిలోదకము, వాసోదకము మొదటి నుండి పదవరోజువరకు ప్రతిరోజు మూడేసిసార్లు ఇవ్వాలి మృత్తికాస్నానం చెయ్యాలి నిత్యకర్మ చివర వాససును మూడు మడతలు చేసి తిలలు, దర్భలు ఉంచి నీటితో గోత్రనామాలు ఉచ్చరిస్తూ శిలమీదుగా విడవాలి (వాసోదకం) ఒకసారి మంత్రంతోను, రెండుసార్లు మంత్రం లేకుండాను వాసోదకం వదలాలి. తిలోదకాలు బ్రాహ్మణులైతే మొదటిరోజు 3, రెండవ రోజు 4, ఈ ప్రకారంగా రోజుకి ఒకటి చొప్పున పెంచుతూ ఇవ్వాలి. క్షత్రియులైతే రోజుకు 5 చొప్పున వైశ్యులయితే రోజుకు 4 చొప్పున శూద్రులయితే రోజుకు 3 చొప్పున తిలోదకాలివ్వాలి. క్షత్రియ, వైశ్యుల విషయంలో వరసగా 12వరోజున, 15వ రోజున 9 తిలోదకాలు ఇవ్వాలి. బ్రాహ్మణులకు పేరు చివర శర్మ అని, క్షత్రియులకు వర్మ అని, వైశ్యులకు గుప్త అని, శూద్రులకు దాస అని చేర్చాలి. స్త్రీల విషయంలో క్రమంగా దాయి, దేవి, గోపి, అభినాద్యా అని చేర్చాలి.

తిలలు, బియ్యము, పెసరపప్పు, కందమూల ఫలాదులు వండి పెద్ద మారేడు పండంత పిండం తయారుచెయ్యాలి. మొదటిరోజు చేసినట్లుగానే 10వ రోజువరకు పిండం తయారుచెయ్యాలి. మొదటిరోజు పిండాన్ని ఎక్కడ ఉంచుతారో 10 రోజులూ అక్కడే ఉంచాలి. మొదటిరోజు కర్మ ఎవరు ప్రారంభిస్తారో వారే 10 రోజులూ కర్మ చెయ్యాలి. ఉత్తరీయం, శిల వంటకు (పిండం వండేందుకు) ప్రయోగించే పాత్ర, పిండం వండే చోటు, పిండం ఉంచే చోటు - ఇవేవీ మార్చకూడదు. వీటిలో ఏవైనా నశిస్తే దానికి దగిన ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. క్షత్రియులు 12 రోజులు. వైశ్యులు 15 రోజులు నిత్యకర్మ చెయ్యాలి.

శవయాత్రకు ముందు కర్త ధరించిన (తెల్ల) వస్త్రాన్నే దీక్షా వస్త్రంగా కర్మ చేసినన్ని రోజులూ నిత్యకర్మ సమయంలో ధరించాలి. అట్లాగే వాసస్సును కర్మచేసే సమయంలో ధరించాలి. దహనానంతరం నుంచి ఇంట్లో శవాన్ని భూశయనం చేసిన గదిలో ఒకదీపం రోజూ వెలిగించాలి. ఆ గదిలో శవం తలవైపున ఒక ధారాపాత్రను వేలాడగట్టాలి. కింద ఒక పాలికలో మట్టి నవధాన్యాలుంచి పాత్రలో నీరు చుక్కలుగా వాటిలో పడుతూ ఉండేటట్లు చెయ్యాలి. ఇది కర్మ ప్రారంభించిన రోజునే చెయ్యాలి.

ప్రతిరోజూ కర్మ చేసి ఇంటికి రాగానే దీపం వెలుగుతున్నట్లు నిర్ధారించుకొని ఇంట్లోకి వచ్చి దీపానికి నమస్కరించి దీక్షావస్త్రాన్ని ఉత్తరీయాన్ని విడిచి తడిపి ఆరవెయ్యాలి. వాసస్సును, శిలను, పచనపాత్రను భద్రపరచాలి. ధారాపాత్రలో నీళ్లు పొయ్యాలి.

మగవాడు మృతి చెందినపుడు అతని భార్యయే కర్త అయితే మృతి సమయానికి ఆమె బైట ఉంటే మలాప కర్షణ స్నానం చేసి విధ్యుక్తమైన ప్రాయశ్చిత్తాదులను చేసుకొని దహన సంస్కారానికి పురుషునకెవనికైనా అనుజ్ఞ నిచ్చి జరిపించాలి. నిత్యకర్మ మాత్రము 5వ రోజు స్నానం (మారు నీళ్లు) అనంతరం ప్రారంభించాలి. విధ్యుక్తంగా దహనం చేయించడం వీలుకాకపోతే మంత్రం లేకుండా (ఎవరిచేతనో) దహనం చేయించి 5వ రోజు స్నానానంతరం దహనాదికంగా కర్మ అంతా (ఎవరిచేతనైనా) జరిపించాలి. పదిరోజుల మధ్యలో బైట చేరితే నిత్యకర్మ ఆపి మారు నీళ్లనాడు మొదటి రోజునుంచి చెయ్యవలసిన నిత్యకర్మ చేయించాలి. సంచయనానికి ముందు బైట చేరితే దహనంకూడా తిరిగి జరిపించాలి.

తల్లిదండ్రులు, తాత, అమ్మమ్మలు కాక ఇతరులకు కర్మ చేస్తూండగా పదిరోజులలోపుగా అమావాస్యగాని, సంక్రమణము (కర్కాటక, మకర)గాని సంభవిస్తే ఆనాడే 10 రోజులూ ఈయవలసిన తిలోదక పిండప్రదానాలు జరపాలి. ఇది కుమారుడు, దత్తుడు, దౌహిత్రుడు కర్మ చేసేటప్పుడు వర్తించదు. అయితే చతుర్దశి గడియలలో మృతి చెందిన వారికి మామూలుగా 10 రోజులూ జరపాలి. త్రయోదశినాడుగాని, ముందుగాని మృతి చెందితే మాసం మారకుండా సంచయనం చెయ్యాలి.

## నవశ్రాద్ధములు

ఆహితాగ్నులను దహనదినం మొదలుపెట్టి, అనాహితాగ్నులకు మరణదినం నుంచి మొదలుపెట్టి 1,3,5,7,9,11 రోజులలో నవశ్రాద్ధాలు జరపాలి. ఋగ్వేదులకు ఇందులో 5, యజుర్వేదులకు (6) జరపాలి. ఇతరులకు 5గాని, 6గాని జరపాలి. ఇది కశ్యపుని నిర్ణయం. ఈ 5 నవశ్రాద్ధాలూ 10 రోజులలో (ఋగ్వేదులకు) పూర్తి కాకపోతే 11వ రోజున పూర్తి చెయ్యవచ్చు. క్రమంగా జరిపేటప్పుడు వారదోషాలు చూడక్కరలేదు. ఈ నవశ్రాద్ధాలలో ఏ రోజున జరపవలసిందాన్ని ఆ రోజు జరపటం కుదరకపోతే 11వ రోజునే జరపాలి. ఆపస్తంబుడు, బోధాయనుడువంటి కొందరు మహర్షులు క్షత్రియులకు 7 నవశ్రాద్ధాలు (13వ రోజు వరకు) వైశ్యులకు 9 (13, 15 రోజులలో కలిపి) తక్కిన వారికి 6 అని చెప్పారు. ఇవి సకాలంలో చెయ్యకపోతే 11వ రోజున (క్షత్రియులకు 13వ రోజున, వైశ్యులకు 16వ రోజు) జరపాలి. ఆయా రోజులలో వీటిని నిత్యకర్మానంతరం జరపవచ్చు.



## దశాహము, ఏకాదశాహము

మృతిచెందిన 10వ రోజున (ఇక నుంచి వర్ణాన్ని బట్టి 12, 15వ రోజుగా అర్థం చేసుకోవాలి.) ప్రేతకు ఆకలి ఎక్కువగా ఉంటుంది కాబట్టి నిత్యకర్మకు ముందే భూతబలి చెయ్యాలి. భూతబలి, పిండదానాలవల్ల ప్రేతకు తృప్తి కలిగి సంతతి వృద్ధి చెందుతుంది. శని, ఆది, గురువారాల్లో దశాహం అయితే తల్లిదండ్రులకు తప్ప ఇతరులకు భూతబలి ఇయ్యకూడదని కొందరిమతం. అయితే భూతబలి విషయంలో వారదోషం ఎంచకూడదని పితృమేధసారంలో ఉంది.

నిత్యకర్మ సామగ్రితోపాటు ధారాపాత్ర, మొలకెత్తిన నవధాన్యాలతో కూడిన పాలికలోహితవర్ణం గల ఎద్దు చర్మం, శిల, దర్భలు, ప్రబ్బలి కొమ్మ, ఉసిరికాయ, ప్రబ్బలిపూలమాలిక (వేతసమాలిక), కాటుక, ఉదక కలశం, ఓషధి సంబంధమైన మొక్కలు, ఆకులు, వారుణ స్రుక్సువాలు, అగ్ని, గంధం, అక్షతలు వీటన్నిటినీ సమకూర్చుకొని, జ్ఞాతులతోను బంధువులతోను జలాశయం దగ్గరికి వెళ్లి స్నానం చేసి నిత్యకర్మ చెయ్యాలి. అనంతరం వపనం చేయించుకోవాలి. (కంఠం కింద కూడా క్షౌరం చేయించుకోవాలి అనగా చంకలు, గోళ్లు సహా)

అనంతరం అఘాపనుత్తి హోమం చేసి తరవాత పచనపాత్ర, శిల, వాసస్సులకు ఉద్వాసన జరపాలి. (వాసస్సు మాత్రం ప్రేతశబ్ద నివృత్తి వరకు ఉంచి తరవాత విసర్జించటం కొన్నిచోట్ల ఆచారం) పురుషుని మృతి విషయంలో మృతుని భార్యకు ఇప్పుడు మంగళసూత్రాదులు తొలగించాలి. ఇది ఇంట్లో చెయ్యకూడదు అందువల్ల కొందరు 10వరోజు సూర్యోదయం కాకుండానే ఇవి తొలగిస్తున్నారు. ఇది శాస్త్రసమ్మతం కాదు. ఈ సమయానికి ఆమె బయట ఉంటే స్నానదినం వరకు ఆగి ఆ రోజున మంగళసూత్రాదులు తొలగించాలి.

శిలోద్వాసన తరవాత సపిండులైన బంధువులు ప్రాచీనావీతిగా, తిలలతోను, తక్కిన బంధువులు సవ్యంగా తిలలు లేకుండాను ధర్మోదక ప్రదానం చెయ్యాలి. అప్పుడు కర్త దీక్షావస్త్రాలు విసర్జించి, నూతన దీక్షావస్త్రాలు ధరించాలి. వీటిని కర్త అత్తవారుగాని, అవివాహితుడైతే తల్లి పుట్టింటివారుగాని ఇవ్వటం ఆచారంగా వస్తుంది.



ఈ పదిరోజులు ఇచ్చే పిండప్రదానం వల్ల ప్రేతకు1వరోజు తల, 2వ రోజు కళ్లు, చెవులు, ముక్కు, 3వ రోజు మెడ, చేతులు, వక్షస్థలము 4వ రోజు బొడ్డు, కటిప్రదేశం, 5వ రోజు తొడలు, 6వరోజు చర్మం, 7వరోజు నాడులు, 8వరోజు రోమాలు, 9వ రోజు వీర్యం, 10వ రోజు ఆకలి నివృత్తి అవుతాయి. ఈ రకంగా ప్రేతత్వం పోయి భోగశరీరం ఏర్పడుతుంది. ఈ పది రోజులలో ఏ రోజునైనా కాకులు పిండాన్ని తినకపోతే ప్రేతత్వం పోదు (మృతులకేవైనా కోరికలున్నా యేమోనని ఊహించి వాటిని తీరుస్తామని మొక్కుకోవటం ద్వారా కాకులు పిండాన్ని తినేటట్లు చేయటానికి ప్రయత్నిస్తుంటారు)

పదకొండవ రోజున (క్షత్రియులు 13, వైశ్యులు 16వ రోజున) ఉదయం సంగమ కాలంలో, (సూర్యోదయానంతరం సుమారు 2 1/2 గంటల తరువాత) కర్త స్నానం చేసి బ్రాహ్మణుని, ఉదకాన్ని ముట్టుకోవాలి. అప్పుడు ఆశౌచ శుద్ధి కలుగుతుంది. అనంతరం పుణ్యాహవాచనం విఘ్నేశ్వరపూజ (గృహశుద్ధికి) చెయ్యాలి. సమంత్రక ఆహ్నికం చెయ్యాలి. ఆరు నవశ్రాద్ధాలు చెయ్యవలసినవారు (యజుర్వేదులు) మొదట నవశ్రాద్ధము తరువాత మధ్యాహ్నం స్వతంత్రైకోద్దిష్టం, ఆ

తరువాత నవమిశ్ర శ్రాద్ధం (షోడశ శ్రాద్ధంలో మొదటి ఆద్యశ్రాద్ధం) జరపాలి. అయిదు నవశ్రాద్ధాలు చేసేవారు 11వ రోజున నవశ్రాద్ధం జరపనక్కరలేదు (అంతకుముందు అయిదూ కాకపోతే అదికూడా జరపాలి.) తదుపరి షోడశం పూర్తి చెయ్యాలి. ఈ ఏకోద్దిష్టంలో విశ్వేదేవతలుండరు ఒకే అర్ఘ్యపాత్ర, ఒకే దర్భతో చేసిన పవిత్రం ఉంటాయి. ఆవాహన, అగ్నౌకరణం ఉండవు. కర్తకు ఎటువంటి ఆశౌచం సంక్రమించినప్పటికీ 11వ రోజున జరపవలసిన స్వతంత్రైకోద్దిష్టం ఆపక్కరలేదు. తల్లిదండ్రులలో ఒకరి 11వ రోజు నాటికి రెండవవారికి కర్మ చేస్తున్నప్పటికీ మొదట పోయిన వారి ఏకోద్దిష్టం ఆపక్కరలేదు. ఆ సమయంలో మాత్రం కర్తకు ఆశౌచం ఉండదు. అనవసరమైన శంకతో ఎవరైనా ఈ ఏకోద్దిష్టం మానివేస్తే వారు మొదటి నుంచి కర్మ తిరిగి చెయ్యవలసి ఉంటుంది. షోడశశ్రాద్ధం అంటే మొదటి సంవత్సరంలో పెట్టవలసిన 12 మాసికాలు, 3 ఊనాలు, 1 త్రైపక్షికం కలిపి ముందు ముందు ఆటంకం రావచ్చనే భావంతో 11వ రోజునే జరిపే శ్రాద్ధం ఇవికాక వృషోత్సర్జనం కూడా జరపాలి. భర్త, పుత్రులు జీవించియున్న స్త్రీ చనిపోతే వృషోత్సర్జనం బదులు గోదానం చేయాలి. వృషోత్సర్జనం 11 రోజున చేయకపోతే 3వ పక్షం, 6వ మాసం, ఆబ్దిక దినాలలో చెయ్యవచ్చు. చైత్రకార్తికాలు, రేవతీ నక్షత్రం, గ్రహణాలు, మేష, తుల, కర్కాటక, మకర సంక్రమణాలు ఇవన్నీ మంచివే మూఢంలో చెయ్యకూడదు.

## సపిండీకరణము

మృతినొందిన పురుషుడు అంతకుముందు తన తండ్రికి జరిపే ఆబ్దికాదులలో తనతండ్రి, తాత, ముత్తాతలకు పిండప్రదానాదులు చేసి వుంటాడు. ఇప్పుడు అతని కుమారులు ఈ క్రమంలో మొదటగా తండ్రి (చనిపోయిన వ్యక్తి), తాత, ముత్తాత, ముత్తాత తండ్రిని నాలుగుతరాలకి నాలుగు పిండాలు చేసి అనంతరం నాలుగోతరం (ముత్తాత తండ్రి) వారికి ఉద్వాసన చెప్పాలి. ఇక మీదట కర్తయొక్క తండ్రి, తాత, ముత్తాతలకు మాత్రమే పిండప్రదానాదులు జరుగుతాయి. ఈ ప్రక్రియనే సపిండీకరణం లేదా సాపిండ్యం అంటారు. స్త్రీల విషయంలో తల్లి, నాయనమ్మ, ముత్తాత భార్య, ఆమె అత్తగారుగా అర్థం చేసుకోవాలి. పుత్రులు కాక ఇతరులు

కర్తగా జరిపేటపుడు కూడా మృతవ్యక్తిని బట్టి పైవిధంగా సాపిండ్యం జరపాలి. దీనినే చతుర్థ పురుష విసర్జన అనికూడా అంటారు. ఒకవేళ తండ్రి సాపిండ్య సమయానికి (ముత్తాత) బతికుంటే, తండ్రి పై తరాలలో చనిపోయిన మూడుతరాల పురుషులకు పిండప్రదానం చేసి, మూడవ పురుషునికి ఉద్వాసన చెప్పి దిగువ తండ్రిని చేర్చాలి. ఇటువంటి సందర్భంలో 'వ్యుత్క్రమసాపిండ్యం' అంటారు. ఈ వ్యుత్క్రమ సాపిండ్యం జరిపిన తరువాత జీవించి ఉన్న పై తరం వారు చనిపోతే వారి సాపిండ్యం అయిన తరువాత తండ్రికి జరిపే శ్రాద్ధానికి (ఊనం, మాసికం, ఆబ్దికంలలో ఏది మొదట వస్తే అది) ముందుగా "వ్యుత్క్రమసపిండీకృతస్స క్రమసాపిండ్యార్థం" అనే శ్రాద్ధం ప్రేతశబ్దం వాడకుండా జరపాలి. తల్లి, పితామహి ప్రపితామహి విషయంలో కూడా ఇదే విధంగా వ్యుత్క్రమసాపిండ్యాలు జరపాలి.

కలియుగంలో సపిండీకరణానికి 12వ రోజు ముఖ్యమైన దినంగా నిర్ణయించ బడింది. అయితే ఈ 12వ రోజున జరపటానికి ఆటంకాలు వస్తాయేమోననే భయం ఉన్నట్లయితే 11వ రోజునే ఆ రోజు చేయవలసిన కార్యక్రమం పూర్తి అయ్యాక జరపాలి. ఈ యుక్తకాలానికి కర్త భార్యగాని, మృతుని భార్యగాని బహిష్టు అయి ఉంటే శుద్ధి స్నానానంతరం జరపాలి. సోదరులు సమిష్టిగా తల్లిదండ్రులకు కర్మ చేసేటప్పుడు జ్యేష్ఠుడు అపత్నీకుడైతే తరువాత వాడు ఆక్రమంలో సపిండీకరణం చెయ్యాలని యల్లాజీయంలో ఉన్నది. సపిండీకరణం అయినాక గాని ప్రేతత్వ విముక్తి లభించదు. ముఖ్యంగా పుత్రులు తల్లిదండ్రుల విషయంలో ఈ సపిండీకరణం జరిపితేగాని శుద్ధులుకారు. ఈ సమయంలోనే శక్త్యానుసారం గోదానాది దశదానాలు, షోడశదానాలు, విశేషదానాలు జరపాలి. అంతే కాక బంధుమిత్రులకు భోజనాలు పెట్టాలి.

సపిండీకరణం తరవాత కర్త స్నానం చేసి మొదటి మాసికం పెట్టాలి. ఇది నిజానికి మృతదినంనాడు పెట్టవలసినదే కాని ఆనాడు ఆశౌచం సోకటంవల్ల ఇప్పటివరకు వాయిదా పడుతుంది. ఈ మాసికం గురించి బంధుమిత్రుల భోజనం ఆపకూడదు. ఆ వంటకీ, మాసికం వంటకీ సంబంధం లేదు. అంతేకాక బంధుమిత్రుల భోజన కార్యక్రమం అయ్యాక 12వ రోజు కార్యక్రమం పూర్తి అయినట్లు భావించాలి.

## సందిగ్ధ పరిస్థితులు

విభక్త, అవిభక్త సోదరులు. చనిపోయిన వ్యక్తికి పుత్రులంతా కర్తలే. అందులో పెద్ద కుమారుడు ప్రధానకర్త. అనేకమంది భార్యలున్న సందర్భంలో కూడా వయస్సులో పెద్దవాడైన కుమారుడే ప్రధాన కర్త అవుతాడు గాని భార్యలలో పెద్ద, చిన్న అనే భేదం లేదు. కవల సోదరులలో వెనుక పుట్టినవాడు పెద్ద, ముందు పుట్టినవాడు చిన్న (ఇది భాగవతంలో ఉన్నట్లు వెంకట సోమయాజీయంలో చెప్పబడింది.) విభక్తులైనా అవిభక్తులైనా కుమారులందరు కలిసే అపరకర్మ జరిపించాలి. సపిండీకరణం మాత్రం విభక్త సోదరులు విడివిడిగా చేయవచ్చు లేదా ఖర్చు అందరూ పెడుతూ కలిసి చేయవచ్చు. సపిండీకరణం విడివిడిగా జరిపితే తరువాత శ్రాద్ధాలన్నీ విడివిడిగానే జరపాలి. సపిండీకరణం కలిసి జరిపితే సంవత్సర విమోకందాకా తప్పక కలిసే జరపాలి. తరువాత వారి ఇష్టం. పెద్ద కుమారుడు కర్మ చేస్తుంటే తక్కినవారు సహాయకులుగా ఉంటారు.

**జ్యేష్ఠుడు దహన సమయానికి రాకపోతే :** తమ్ములుగాని, ఇతరులుగాని దహన సంస్కారం జరిపి కర్మ ప్రారంభించాలి. సంచయనం ముందుగాని, తరువాత గాని పదోరోజులోగా ప్రధానకర్త వస్తే అతడు అప్పటి నుంచి కర్మ చెయ్యాలి. ఒకవేళ దహన సంస్కారం శాస్త్రయుక్తంగా జరుగకపోతే ప్రధానకర్త వచ్చి, దహన సంస్కారం నుంచి కర్మ ప్రారంభించాలి.

తమ్ములుగాని, ఇతరులుగాని శాస్త్రయుక్తంగా 9 రోజులు కర్మ చేశాక పదోరోజున ముఖ్యకర్త వస్తే అతడు వపనం చేయించుకుని, తొమ్మిది రోజులకు సంబంధించిన తిలోదక పిండ ప్రదానాదులు ఆ రోజునే జరిపి అపుడు పదో రోజు కార్యక్రమం ప్రారంభించాలి.

ముఖ్యకర్త 11వ రోజు అపరాహ్ణానికి ముందు వస్తే అప్పుడు వపనం చేయించుకొని, ఏకోద్దిష్టం జరిపి తరవాత 10 రోజుల తిలోదకాలు ఇవ్వాలి. ఒకవేళ అంతకుముందరి కార్యక్రమం శాస్త్రోక్తంగా జరగకపోతే అప్పటినుంచి 10 రోజులు ఆశౌచం పడుతూ ఉదకదానం మొదలైనవి చేసి 11వ రోజున (అనగా వచ్చిన తరవాత 11వ రోజున) ఏకోద్దిష్టం చేసి మూడవ పక్షంలో (అనగా నెల దాటాక) సాపిండ్యం జరపాలి. ముఖ్యకర్త వచ్చే ముందు తమ్ములు సాపిండ్యం జరిపినప్పటికీ

అతడు 10 రోజులు మైలపడుతూ, ఉదకదానం మాత్రం చేస్తూ, మూడవ పక్షంలో సాపిండ్యం జరపాలి.

తల్లిదండ్రుల మరణవార్త కుమారుడు సంవత్సరంతరవాత విన్నప్పటికీ, వినగానే వర్పునం చేయించుకుని 10 రోజులు మైలపడుతూ యధావిధిగ కర్మలుచేయాలి.

**రజస్వల :** ముఖ్యకర్త భార్య బహిష్టు అయినప్పటికీ 10వ రోజువరకు కర్మకాండకు ఆటంకం లేదు. 11వ రోజు నాటికి బైట ఉంటే స్వతంత్రైకోద్దిష్టము, షోడశంలో భాగమైన ఆద్యశ్రాద్ధము, రుద్రగణము, వృషోత్సర్జనము జరపవచ్చు. కాని షోడశశ్రాద్ధంలో మిగిలిన భాగం, 12వ రోజు కార్యక్రమం ఆపాలి. 12వ రోజున గాని 13 రోజునగాని బహిష్టు శుద్ధి అయితే ఆనాడే రెండవసారి స్నానం చేయించి అప్పుడే షోడశ శ్రాద్ధము, సపిండీకరణము జరపాలి. 12వ రోజు శుద్ధి అయితే వీలు కానప్పుడు సపిండీకరణం 13వ రోజున చెయ్యవచ్చు. 14వ రోజు శుద్ధి అయితే ఈ కార్యక్రమం అంతా 15వ రోజునే జరపాలి. ముఖ్యకర్త సోదరుల భార్యలు బహిష్టయినప్పటికి పై వాటిని సకాలంలో చేయవచ్చు.



మృతుని భార్య సపిండీకరణం సమయానికి బహిష్టు అయితే, కర్త ఎవరైనా సపిండీకరణం ఆరోజు చేయకుండా బహిష్టు 5వ రోజు శుద్ధి అనంతరం జరపాలి. సపిండీకరణం ఆపక్కరలేదని కొందరి మతం అయినప్పటికీ శుద్ధి తరవాత జరపటమే శిష్టాచారం నిర్ణయ సిధు సపిండీకరణం 12వ రోజు నుంచి 17వ రోజు వరకు లేదా 23 వ రోజున లేదా మూడవ పక్షంలో కూడా జరపవచ్చునని ఉన్నది.

స్త్రీ కర్త అయి ఉండి మృతి సమయానికి బహిష్టు అయి ఉంటే

1. భర్త విషయంలో మలాపకర్షణ స్నానం చేసి విధ్యుక్త ప్రాయశ్చిత్తాలు చేసుకుని, భర్త దహన సంస్కారం ఇతరుడికి అనుజ్ఞ ఇచ్చి జరిపించాలి. కర్మ మాత్రం బహిష్టు 5వ రోజు నుంచి ప్రారంభించాలి. లేదా అమంత్రకంగా దహనం జరిపించి బహిష్టు 5వ రోజున మంత్రపూర్వకంగా తిరిగి దహనం చేయించి (వైద్యనాధీయం) కర్మ ప్రారంభించాలి. (ఇది ఇతరులకు స్త్రీ కర్త అయినప్పుడు కూడా)

2. స్త్రీ కర్త అయి ఉండి దశాహ మధ్యంలో సంచయనం తరవాత బహిష్టయితే కర్మ అంతటితో ఆపి, బహిష్టు 5వ రోజున నగ్నప్రచ్ఛోదనంతో నిత్యకర్మ ప్రారంభించి

పూర్తి చేయించాలి. సంచయనానికి పూర్వమే బహిష్టయితే బహిష్టు 5వ రోజున తిరిగి దహన సంస్కారం జరిపించి కర్మ ప్రారంభించాలి.

**ప్రసవం :** మృతి సమయానికి పుత్రులలో ఏ ఒకరి భార్య అయినా ప్రసవించిన పురిటి రోజులైతే దహనాది కర్మకు ఏ ఆటంకమూ లేదు. అనంతరం దశాహ మధ్యంలో ఏ పుత్రుని భార్య అయినా ప్రసవించి 11వ రోజుకు పురిటి శుద్ధి కాకపోతే స్వతంత్రైకోద్దిష్టము వరకు చేయవచ్చు. తక్కిన కార్యక్రమం పురిటిశుద్ధి అనంతరమే జరపాలి. (పురిటాలి భర్తకు పురిటి శుద్ధి కాదు కనక, షోడశ సాపిండ్యాలు అవిభాజ్యంగా జరపవలసినవి కనక వాయిదా పడక తప్పదు.)

**తల్లిదండ్రుల కర్మల కలయిక :** తల్లిదండ్రులలో ఒకరు చనిపోయిన దశాహ మధ్యంలో రెండవవారు చనిపోతే రెండవ వారికి 12వ రోజున సాపిండ్యం చేయవచ్చును. కాని ముందు పోయినవారికి 3వ పక్షంలో చెయ్యాలి. అయితే తండ్రి పోయిన నాడుగాని మరునాడుగాని తల్లి పోతే ఆనాటికి 12వ రోజున ఇద్దరికీ కలిపి సాపిండ్యము చేయాలి. (వైద్యనాథీయం)

తండ్రి కర్మ చేస్తూ 10 రోజుల మధ్యలో కర్త చనిపోతే అతని కుమారుడు తనతండ్రికి నిత్యకర్మ యధావిధిగా చేసి సాపిండ్యం మాత్రం తాతగారి సాపిండ్యం అయినతర్వాతనే చెయ్యాలి. ఒకవేళ తాతగారికి ఇతర పుత్రులు లేక తన తండ్రే కర్త అయితే, తండ్రి కర్మలు పూర్తి అయ్యాక తాతగారి ప్రేతకార్యం మొదటి నుంచి చేసి సాపిండ్యం చేసి అనంతరం తండ్రి సాపిండ్యం చెయ్యాలి. (వైద్యనాథీయం). తండ్రికి 10 రోజుల కర్మ పూర్తి చేసి కొడుకు చనిపోతే అతని పుత్రుడు ఈ 10 రోజులు కర్మలు తిరిగి చెయ్యక్కరలేదు.

తండ్రి అశక్తుడై పుత్రునికి అనుజ్ఞ ఇచ్చి తన తండ్రి కర్మ చేయిస్తూండగా తాను చనిపోతే తనకుమారుడు పై విధంగానే రెండు కర్మలూ చెయ్యాలి.

**ఆశౌచంలో ఇతరుల కర్మ :** మైల పడుతుండగా తాను కర్త అయిన జ్ఞాతి చనిపోతే మొదటి ఆశౌచంతో కుటుంబ సభ్యులందరికీ శుద్ధి అయినప్పటికీ, తనకు కాదు. జ్ఞాతి కర్మ పూర్తిగా జరిపించాలి.

**ఏకకాల మరణము :** తల్లిదండ్రులలో ఒకరి దహనానికి పూర్వం రెండవవారు చనిపోతే దహన సంచయనాదులు కలిపి చెయ్యాలి. తిలోదక, పిండదానాది

నిత్యకర్మలు విడివిడిగా జరపాలి. సపిండీకరణం కలిపిగాని విడివిడిగా గాని చేయవచ్చు (స్మృతి సంగ్రహం)

తల్లిదండ్రులు కాక తాను కర్తగా ఉన్న ఇతరులలో ఒకేసారి ఒకరికన్న ఎక్కువమంది చనిపోతే సంబంధ సామీప్యం (దగ్గర చుట్టరికం) పరిగణించి నిత్యకర్మల ముందు వెనుకలు నిర్ణయించుకోవాలి. దహనం మాత్రం తెలిస్తే మరణ క్రమాన్ని అనుసరించి జరపాలి. బంధుత్వం సమంగా ఉంటే పెద్దవారికి కర్మ ముందు చెయ్యాలి. ఈ కర్మలు ఎవరికి వారికే విడిగా జరపాలి.

తండ్రి చనిపోయిన సంవత్సరంలో భార్య, పుత్రుడు, పౌత్రుడు, సోదరుడు, సోదరుని కుమారుడు, కోడలు, సోదరి వీరలలో ఎవరైనా చనిపోయితాను కర్త అయితే వారి సాపింద్యం (తండ్రి సాపింద్యం తరవాత వచ్చేలాగ) జరపాలి. వీరిలో కొందరు ఏకకాలంలో చనిపోతేపైన చెప్పిన క్రమం ప్రకారం సాపింద్యం జరపాలి. వీరు కాక ఇతర బంధువులకు తాను కర్త అయితే తండ్రి సంవత్సర విమోకం అయ్యేదాకా వారి సాపింద్యం జరపకూడదు. ఏకోద్దిష్టంతో కర్మ ఆపుచేసి తండ్రి సంవత్సర విమోకానంతరం జరపాలి. (ఋశ్యశృంగుడు) తల్లి చనిపోయిన సంవత్సరానికి సంబంధించికూడా పైవిధంగానే అనుసరించటం యుక్తమని తోస్తున్నది.

**స్త్రీ దహనం :** బహిష్టు అయిన స్త్రీ చనిపోతే పంచగవ్యాలతో స్నానం చేయించి వస్త్రం మార్చి యధావిధిగా దహనం జరిపించాలి.

ప్రసవించిన స్త్రీ పది రోజులలోపుగా మరణిస్తే కుండలో నీరు గ్రహించి పూర్ణ ముక్కులచే శుద్ధి జరిపించి అనంతరం దహనం జరిపించాలి.

గర్భిణి స్త్రీ చనిపోతే ఆరు మాసాలలోపునే అయితే గర్భస్థ శిశువుతో సహ దహనం చెయ్యాలి. ఏడవ నెల ప్రవేశించినతర్వాత అయితే శిశువును బయటకు తీసి మరణించినట్లయితే శిశువును ఖననం చేసి తల్లి శరీరానికి పంచగవ్యాలతో మంత్రకంగా శుద్ధి జరిపించి దహనం చెయ్యాలి.

**ఇతర విషయాలు :** తల్లిదండ్రులలో ఎవరైనా దేశాంతరం వెళ్లి వారి కబురు తెలియకపోతే 15 సంవత్సరాల అనంతరం అమావాస్య లేక ఏకాదశినాడు కర్మ ప్రారంభించి యధావిధిగ జరపాలి. ఆ తిథినే మరణతిథిగా భావించాలి. తాను కర్త అయిన ఇతరుల విషయంలో 12 సంవత్సరాలు వేచి ఉండి పై విధంగానే జరపాలి.

ఆ తరవాత మరణించారనుకున్న వ్యక్తి తిరిగి వస్తే ఆవు నేతితో స్నానం చేయించి జాతకర్మ, నామకరణాది సంస్కారాలు జరిపించి 12 రోజులు (కనీసం 3 రోజులు) వ్రతం చేయించాలి. ఆ వ్యక్తి భార్య లేదా భర్త జీవించి ఉంటే తిరిగి వారి వివాహం కూడా జరిపించాలి. (వైద్యనాధీయం)

2. అమ్మమ్మ, తాతయ్యలకు తాను కర్త అయి కర్మ చేస్తుండగా తన జ్ఞాతి మృతి చెందితే ఆ ఆశౌచ శుద్ధి వరకు కర్మ ఆపుచేసి తరవాత నగ్నప్రచ్ఛాదనంతో ప్రారంభించి కర్మ చెయ్యాలి.

3. భర్త చనిపోయిన 3 రోజులలో అనగా సంచయానానికి ముందు భార్య చనిపోతే ఆమె దశాహంనాడు చేటలవాయనమిచ్చి సువాసినీ పూజ చెయ్యాలి.

4. కర్త (దౌహిత్రుడు వగైరా) అన్యశాఖీయుడైనప్పటికీ దహనాది కర్మలన్నీ మృతుని శాఖ సంప్రదాయాన్ని అనుసరించి జరపాలి.

5. నిత్యకర్మలో వాడే ఉత్తరీయం, వాసస్సు, శిల, పచనపాత్ర మొదలైన వాటిలో ఏదైనా పోతే కృచ్ఛ్రత్రయం చేసి, తిరిగి వాటిని సమకూర్చుకుని మొదటినుంచి నిత్యకర్మ జరపాలి.

6. ఉపనయనం కాని కర్తకుగాని, స్త్రీ కర్తకుగాని ప్రతినిధిగా మరొకరు దహనం కర్మ, చేస్తున్నపుడు ప్రతినిధి భార్య బహిష్టు అయినా, మరొక ఆశౌచం ప్రతినిధికి వచ్చిన కర్మ ఆపకూడదు. అయితే తన తల్లిదండ్రులలో ఎవరైనా చనిపోతే మాత్రం ఈ కర్మ విడిచిపెట్టాలి. దీనిని మరొక ప్రతినిధిచేత మొదటి నుంచీ చేయించాలి. (ధర్మసంగ్రహబోధిని)

7. తండ్రి చనిపోయినప్పుడు తాత, ముత్తాతలలో ఎవరైనా బతికి ఉండి తండ్రి సాపిండ్యానికి ముందుగా వారు చనిపోతే వారి సాపిండ్యం అయిన తరువాత తండ్రికి సక్రమమైన సాపిండ్యం జరపాలి. తండ్రి ఏకోద్దిష్టానికి ముందు వారు చనిపోతే వారి 11వ రోజు కర్మ తరువాత తండ్రికి 11వ రోజు కర్మ, వారి సాపిండ్యం తరువాత తండ్రి సాపిండ్యం జరపాలి. తానేఉభయులకూకర్త అయితే ఒకేరోజు మూడు శ్రాద్ధాలు చెయ్యకూడదు కనుక పైవారి 12వ రోజు అనంతరం తండ్రికి 11, 12 రోజుల కర్మ చెయ్యాలి.

శూన్యతిథి అని పిలుస్తారు. శూన్యతిథినాడు ఆబ్దికం మాసికం వంటి శ్రాద్ధాలు పెట్టకూడదు కాని ఊనషాణ్మాసికము, సాంవత్సర విమోకము వంటివి పెట్టవచ్చును.

శ్రాద్ధదినం కర్తకు ఆశౌచముంటే ఆశౌచశుద్ధినాడు పెట్టాలి. ఆశౌచ శుద్ధి రోజున శూన్యతిథి అయితే మరునాడు పెట్టాలి (శూన్యతిథి అయినా శుద్ధినాడే పెట్టాలని స్మృతిచంద్రికలో ఉన్నది) తిథితో నిమిత్తంలేని శ్రాద్ధం అయితే శూన్యతిథి అయినా ఆశౌచశుద్ధినాడే పెట్టాలి. మరేదైనా కారణంచేత (మరపు) ఆబ్దికానికి అంతరాయం వస్తే ఆ నెలలో ఏకాదశి, అమావాస్యలలో పెట్టవచ్చు.

దేశాంతరంలో మృతి చెందిన వారి విషయంలో 1) మృతిమాసం మాత్రం తెలిసి తిథి తెలియకపోతే ఏకాదశులు లేక అమావాస్య తిథిగా నిర్ణయించాలి. 2) తిథి మాత్రం తెలిసి మాసం తెలియకపోతే ఆషాఢ, భాద్రపద, మార్గశిర, మాఘ మాసాలలో దేనినైనా మృతమాసంగా నిర్ధారించి ఆబ్దికాలు పెట్టాలి. 3) తిథి, మాసం కూడా తెలియకపోతే ఇంటి నుంచి ఆవ్యక్తి బయలుదేరిన తిథి, మాసములను బట్టి మృతతిథిని నిర్ణయించాలి. దానినే ఆబ్దిక తిథిగా భావించాలి 4) అదికూడా తెలియకపోతే మృతి వార్త తెలిసినరోజే చనిపోయిన దినం (సమయంతో సహ) గా పరిగణించి, కర్మకాండ, మాసికాదులు తరువాత తద్దినాలు ఆ ప్రకారం పెట్టాలి. 5) ఎవరైనా దేశాంతరం వెళ్లి ఏ కబురూ లేకపోతే తల్లితండ్రులైతే 15 సంవత్సరములు ఇతరులైతే 12 సంవత్సరాలు వేచి తరువాత పాలాశవిధిని దహనాది కర్మలు చేసి శ్రాద్ధములు పెట్టాలి.

**మాసికాదులకు దిన నిర్ణయము :** చనిపోయిన 12వ రోజున సపిండీకరణం చేసిన తరువాత కర్త స్నానం చేసి మొదటి మాసికం పెట్టాలి. తరువాత నుంచి ప్రతినెలా చనిపోయిన తిథినాడు (తిథి నిర్ణయం ఆబ్దికానికి లాగానే) మాసికం పెట్టాలి. మృతుడు ఆహితాగ్ని అయితే 2వ మాసికం దహనతిథినాడు పెట్టి తరువాతి మాసికాలు, ప్రత్యాబ్దికాలు మృతతిథినాడు పెట్టాలి. ఈ విధంగా మొత్తం 12 మాసికాలు (మధ్యలో అధిక మాసం వస్తే 13 మాసికాలు) అయిన తరువాత, చనిపోయిన సంవత్సరానికి అదే తిథినాడు మొదటి ఆబ్దికం పెట్టాలి. దానికి ముందు రోజున సాంవత్సర విమోకం అనే పేరుతో పార్వణ విధానంగా శ్రాద్ధం జరపాలి. ఇవికాక

త్రైపక్షికము, ఊనషాణ్మాసికము, ఊనాబ్దికము అనే శ్రాద్ధాలు ఆచరించాలి. ఇవన్నీ కలిపి మొత్తం 16 శ్రాద్ధాలవుతాయి.

త్రైపక్షికాన్ని మొదటి నెల కాగానే జరిపే రెండవ మాసికం తరువాత 1 నుంచి 5 రోజులలోగా పెట్టాలి. ఈ రోజులు ఆశౌచంలో పడితే 11 నుంచి 15వ రోజులలో ఒకనాడు పెట్టాలి. ఊనషాణ్మాసికాన్ని ఆరవ నెలలో ఏడవ మాసికానికి 5 నుంచి 10 రోజులు ముందు ఒకనాడు పెట్టాలి. ఊనాబ్దికాన్ని సాంవత్సరవిమోకానికి ముందరి 15 రోజులలో తొలి అయిదు రోజులలోగాని, చివరి 5 రోజులలోగాని ఒకనాడు పెట్టాలి. పైన చెప్పిన త్రైపక్షికం రెండవ మాసికం తరువాత 1 నుంచి 5 రోజులలో చేస్తే ఊనాబ్దికాన్ని చివరి అయిదు రోజులలోను, త్రైపక్షికాన్ని 11-15వ రోజుల మధ్య చేస్తే ఊనాబ్దికాన్ని సంవత్సరం చివరి పక్షంలో మొటి అయిదు రోజులలోను చెయ్యాలి. ఊనమాసికం మొదటి నెలలో 21, 23, 25, 27, 28, 29, 13వ రోజులలో ఒకనాడు చెయ్యవచ్చును. ఈ ఊనములు మూడింటి విషయంలో కృత్తిక, ఆశ్లేష, పుబ్బ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ నక్షత్రాలు లేని రోజులలో చెయ్యటానికి వీలైనంత వరకు ప్రయత్నించాలి అంతేకాని అటువంటి రోజు దొరకలేదని మానకూడదు. వీటికి అధికమాసం పట్టింపు, శూన్యతిథి పట్టింపు లేదు. అయితే ఊనములు శుక్రవారం పెట్టకూడదు. తల్లిదండ్రులకైతే పెట్టవచ్చు. కర్త భార్య బహిష్టు అయితే నాలుగురోజుల వరకు ఏఊనము పెట్టకూడదు. వీటిలో దేనికైనా పై చెప్పిన నిర్ణీత సమయాల్లో పెట్టటానికి ఆటంకాలేర్పడి కుదరకపోతే అది మురిగిపోతుంది. ఆబ్దికం, మాసికాలకు అయితే కర్త భార్య బహిష్టలయినా ఊరిలో లేకపోయినా లౌకికాగ్నిలో అగ్నౌకరణం చేసి పెట్టాలి. సాంవత్సర విమోకం నాడు కర్త భార్య బహిష్టలయితే ఆ శ్రాద్ధం మానెయ్యాలి.

## అధిక, క్షయమాసములు

ఒకవ్యక్తి చనిపోయిన తరువాత ఆబ్దికం పెట్టవలసిన ఏ సంవత్సరంలోనైనా ఆ వ్యక్తి చనిపోయిన మాసానికి అధిక మాసం వస్తే అధికమాసంలో ఆబ్దికం పెట్టక్కరలేదని కొన్ని గ్రంథాలలోఉన్నది. కాని అధిక మాసంలో సంకల్పవిధానంగాను, నిజ మాసంలో పార్వణ విధానంగాను ఆబ్దికం పెట్టటం దేశాచారంగా ఉన్నది.

మరుసటి సంవత్సరంలోనే అంటే సాంవత్సర విమోకం సమయానికే అధిక మాసం వస్తే దానిని మొదటి ఆబ్దికాన్నికూడా అధిక మాసంలోనే పెట్టాలి. (హారీతః) ప్రథమాబ్దికం తిరిగి నిజమాసంలో కూడాపెట్టాలి. సంవత్సరంలోపుగా ఏదైనా అధిక మాసం వస్తే ఆఅధిక మాసంలో కూడా తిథినాడు మాసికం పెట్టాలి. ఆరవ నెల అధికమాసమైతే ఊనషాణ్మాసికం అధిక మాసంలోనే పెట్టాలి. ఒకవేళ ఎవరైనా అధిక మాసంలో చనిపోతే మరుసటి సంవత్సరం ఆపేరుగల మాసంలోనే సంవత్సరీకాలన్నీ జరిపించాలి. అధిక మాసంలో చనిపోయిన వ్యక్తికి ప్రతి సంవత్సరమూ ఆపేరు గల మాసంలో మృతతిథినాడు ఆబ్దికం పెట్టాలి. మళ్లీ అదే మాసం అధికమాసంగా ఎప్పుడైనావస్తే అధికమాసంలో పార్వణ విధానంగా పెట్టాలి. అధికమాసంలో చనిపోతే నిజమాసంలో మృతతిథినాడు తొలిమాసికాన్ని (దీనిని అన్వాద్యము అంటారు. ఇది ఈ సందర్భంలోనే వస్తుంది) పెట్టాలి.నెలలో తిథినాడు మాసికాన్ని, ఆ మర్నాటి నుండి 5 రోజులలోగాని 11వ రోజు నుంచి 15వ రోజులోగాని త్రైపక్షికాన్ని జరపాలి. వ్యక్తి చనిపోయిన తరువాత 12వ రోజులోగా అధికమాసం ప్రారంభమవుతే 12వ రోజున ప్రథమ మాసికంపెట్టి తరువాత అధికమాస మాసికం పెట్టి, పై నెలలో నిజమాస మాసికం పెట్టి ఆ తరువాత పక్షంలో త్రైపక్షికం పెట్టాలి. 12 రోజుల తరువాత అధికమాసం ప్రారంభమవుతే, 12వ రోజున ఊనమాసికం, అధికమాసంలో తిథినాడు ఒక మాసికం, ఆ తరువాత నిజమాసంలో మాసికము, అనంతర పక్షంలో త్రైపక్షికము పెట్టాలి.

ఒక వ్యక్తి చనిపోయిన మాసం తరువాత సంవత్సరాలలో క్షయమాసమైతే (అంటే మరొక మాసంతో కలిసి రెండు మాసాలుగా వ్యవహరింపబడితే) ఆ రెండు మాసాలలో మృతి చెందిన మాసం మొదటిదైతే పూర్వాహ్ణంలోనూ రెండవదైతే మధ్యాహ్నం దాటిన తరువాత ఆబ్దికం పెట్టాలి. తిథి నిర్ణయం మాత్రం ఇదివరకు చెప్పిన పద్ధతినే అపరాహ్ణ వ్యాప్తిని బట్టి చేయాలి. ఎవరైనా క్షయమాసంలో పుట్టడంగాని, చనిపోవడంగాని జరిగితే పగలు రెండు సమభాగాలుగాను, రాత్రి రెండు సమభాగాలుగాను చేసి మొదటి భాగాలలో జరిగితే మొదటి మాసంలో జరిగినట్లు, రెండవ భాగాలలో జరిగితే రెండవ మాసంలో జరిగినట్లు పరిగణించాలి. ఇది మాస నిర్ణయానికి మాత్రమే. ఆసమయానికి ఏ తిథి ఉంటే ఆ తిథినే స్వీకరించాలి.

జాతాశౌచమృతాశౌచాలకు రోజుల లెక్క కూడా దీనివల్ల మారదు. ఈ మాస నిర్ణయం తరువాత సంవత్సరాలలో ఆబ్దిక సమయ నిర్ణయం కోసమే.

## భోక్త-లక్షణములు

శ్రాద్ధంలో బ్రాహ్మణ భోజనం ఒక ముఖ్యాంశము. సాధారణంగా ఇద్దరు బ్రాహ్మణులను భోక్తలుగా నియమించుకొని వారిని పూజించి భోజనం పెట్టాలి. పితృ (మాతృ) స్థానానికి ఒక భోక్తను విశ్వే దేవస్థానానికి ఒక భోక్తను నియమించు కోవాలి. పితృస్థాన భోక్త కర్తయొక్క తండ్రి (తల్లి), తాత (నాయనమ్మ), ముత్తాత, (తాతతల్లి)లకు ప్రతినిధిగా భావించి, వారిని వసు, రుద్ర, ఆదిత్యరూపాలుగా పూజిస్తాము. విశ్వేదేవస్థాన భోక్త పురూరవ, ఆర్ద్రక అనేపేర్లు గల దేవతలకు ప్రతినిధి. వీరు దక్షప్రజాపతి కుమార్తె విశ్వయొక్క 13గురు పుత్రులలో ఇద్దరు. కొన్ని గ్రంథాలలో విష్ణు స్థానంలో మరొక భోక్త ఉండాలని చెప్పబడినప్పటికీ ఎక్కువమంది ఈ సూత్రాన్ని పాటించడంలేదు.



**భోక్తగా తగనివారు** : భోక్తలిద్దరూ అన్నదమ్ములుగాని, తండ్రి కొడుకులుగాని కాకూడదు. కర్తకు సగోత్రుడైనా, కర్తకు దౌహిత్రుడైనా భోక్తగా నియమించకూడదు. భార్య బహిష్టు అయినా, భార్య 6 నెలలు నిండిన (7వ నెల నుంచి) గర్భిణి అయినా, ప్రసవించి నెలపురుడు దాటకపోయినా, భార్య చనిపోయినా ఆవ్యక్తి భోక్తగా పనికిరాడు. బ్రహ్మచారి పనికొస్తాడు. డబ్బు ఆశగలవాడిని, లోభిని, నగ్నశ్రాద్ధము, నవశ్రాద్ధము, ఆద్యశ్రాద్ధము వంటి వాటిలో ప్రేత స్థానంలో తిన్నవాడిని సపిండీకరణంలో గోదానం పట్టినవాడిని శ్రాద్ధంలో భోక్తగా పిలువరాదని ఆర్యోక్తి.

తల్లి పుణ్యస్త్రీగా (పునిస్త్రీ) చనిపోతే తండ్రి జీవించినంత కాలము తల్లి ఆబ్దికాలలో భోక్తలతో పాటు ఒక పుణ్యస్త్రీకి కూడా భోజనం పెట్టాలి. ఆ స్థానానికి గర్భవతిని గాని, ప్రసవించి నెల పురుడు దాటని ఆమెను గాని, పిల్లలు లేని ఆమెను గాని, వ్యాధిగ్రస్తురాలిని గాని, మరుగుజ్జునుగాని, బహిష్టు అయి నాలుగు రోజులు పూర్తికాని (మారు నీళ్లుకాని) స్త్రీనిగాని, వృద్ధురాలినిగాని, కర్తకు సగోత్రురాలిని గాని పిలవకూడదు.

## భోక్తలను పిలిచే పద్ధతి

సాధారణంగా ఆబ్దికాదులకు భోక్తలను పురోహితుడే ఏర్పాటు చేసి సమయానికి వాళ్లు వచ్చేటట్లు చూస్తాడు. కాని పూర్వకాలంలో గృహస్థుడే తన యింట్లో ఆబ్దికానికి భోక్తలను స్వయంగా ప్రార్థించి నియమించుకోవటం జరిగేది. ఆ పద్ధతిని ఇక్కడ వివరిస్తాము.

ముందురోజు రాత్రి విశ్వేదేవస్థానంలో ఎవరిని భోక్తగా పిలవదలచామో వారి వద్దకు వెళ్లి "శ్రాద్ధం భవితాతత్ర విశ్వేదేవార్థే భవద్భిః క్షణః ప్రసాదః కరణీయః" అని చెప్పాలి. వారు అంగీకరించిన తర్వాత పితృస్థానంలో నియమించదలచిన వారి వద్దకు వెళ్లి ప్రాచీనావీతిగా (కర్త) "శ్రాద్ధం భవితాతత్ర పిత్రర్థే (మాత్రర్థే) భవద్భిః క్షణప్రసాదః కరణీయః" అని చెప్పాలి. దీనినే భోక్తృనిమంత్రణం అంటారు. తిరిగి శ్రాద్ధం రోజు ఉదయం మళ్లీ అదే వరుసలో వారి వద్దకు వెళ్లి "అద్యశ్రాద్ధం కర్తవ్య" అని చెప్పి మళ్లీ పైన చెప్పినట్లుగా నిమంత్రణం చెయ్యాలి. శ్రాద్ధంలో సంకల్పం కాగానే మళ్లీ 3వసారి నిమంత్రణం (పురోహితుడు చెప్పించగా) జరుగుతుంది.

నిమంత్రణం అంగీకరించిన భోక్తకు శ్రాద్ధం మొదలు కాకముందే ఆశౌచం సంభవిస్తే (ఇందులో భోక్త భార్య బయట ఉండటం కూడా జరగవచ్చు) మరొకరిని ద్వితీయ నిమంత్రణం ద్వారా నియమించుకోవాలి. మూడవ నిమంత్రణం తరువాత భోక్తకు ఆశౌచ వార్త తెలిస్తే శ్రాద్ధం పూర్తి అయ్యేవరకు ఆశౌచం అంటదు.

నిమంత్రణ సమయానికి, భోక్తగా పిలువబడిన బ్రాహ్మణునికి పై చెప్పిన అనర్హతలేవైనా ఉంటే ఆ విషయం కర్తకు చెప్పి తాను రాలేనని చెప్పాలి. అప్పుడు కర్త వేరొకరిని నియమించుకుంటాడు.

## భోక్తలు పాటించవలసిన నియమాలు

భోక్తగా వెళ్లటానికి అంగీకరించిన వ్యక్తి శ్రాద్ధం ముందురోజు, శ్రాద్ధంనాడు కూడా బ్రహ్మచర్యం పాటించాలి. శ్రాద్ధంనాడు క్షౌరము, తైలాభ్యంగనము చేయకూడదు. ఒకరింట్లో భోక్తగా వెళ్లటానికి ఒప్పుకొని మరొకరి యింటికి భోక్తగా

వెళ్లకూడదు. (అట్లా చేస్తే నరకం అనుభవించి నీచజన్మ ఎత్తుతాడట) అన్నశ్రాద్ధానికి భోక్తగా వెళ్లిన రోజే మరొకచోట ఆమశ్రాద్ధపు స్వయంపాకం తీసుకోకూడదు. (అట్లా చేస్తే ఆ భోక్త తాలూకు పితృదేవతలు నరకానికి పోతారట). భోక్త ఆబ్దిక మంత్రం ఉచ్చరించకూడదు. తాను చెప్పవలసిన మంత్రాన్నే (పురోహితుని సూచన ప్రకారం) ఉచ్చరించాలి. కర్త ఆచమనం చేయకముందు భోక్త ఆచమనం చేయకూడదు. కర్త తన చేయి పట్టుకుని అన్నం తాకించేదాకా అన్నం తాకకూడదు (తాకితే రౌరవాది నరకాలకి పోతాడట) ప్రాణాహుతులు తీసుకునేటపుడు మాటిమాటికి నేయి తాకకూడదు. పవిత్రం (దర్భ)తో ప్రాణాహుతులు తీసుకుని, తరువాత దానిని నేలపై ఉంచి, భోజనానంతరం ధరించి, చెయ్యికడుక్కున్నాక వదలిపెట్టాలి. భోక్తలు ఒకరినొకరు తాకకూడదు. అట్లా తాకితే దోషపరిహారంగా 108సార్లు గాయత్రీ మంత్రం జపించాలి (కొందరు 800 సార్లు అని చెప్పారు) ప్రమాదవశాత్తు ఒకరి ఎంగిలి మరొకరు తాకినా పైవిధంగానే చెయ్యాలి. (భోజనం మానక్కరలేదు) భోక్త తనకు వడ్డించిన పదార్థాలు తప్ప వేరే పదార్థాలు అడగకూడదు. దేనినైనా మారు వడ్డించుమనిగాని వద్దనిగాని సైగలతో చెప్పాలిగాని నోటితో అడగకూడదు. పదార్థాలు రుచిగా ఉన్నాయనిగాని లేవనిగాని చెప్పకూడదు. సగంతిని విస్తరిలో వదిలేసిన భక్ష్యాలని (పిండివంటలని) మళ్లీ తీసుకుని తినకూడదు. వేడిగా ఉన్నవాటిని నోటితో ఊదుకుని తినకూడదు (చల్లారేదాకా ఆగాలి) ఎడమచేతితో అన్నం ముట్టుకోకూడదు. మంచినీళ్లు ప్రధానపాత్రలోంచి వేరే చిన్నగ్లాసులోకి తీసుకుని అవి పూర్తిగ తాగాలి. ప్రతిసారీ ఇలాగే చేయాలి.

భోక్త ఆచమనం చేసేటప్పుడు, ఆపోశనం తీసుకునేటప్పుడు, మంచినీళ్లు, నెయ్యి, పెరుగు, పరమాన్నం తీసుకునేటప్పుడు చప్పుడు చెయ్యకూడదు. పాదాన్ని ఏపాత్రకు తగిలించకూడదు. భోజనానికి ముందు 'బలిదానం' చేసే అలవాటుంటే భోక్తగా భోజనం చేసే రోజు అది మానెయ్యాలి. శ్రాద్ధం రోజున రెండవసారి భోజనం చెయ్యకూడదు. ఆనాడు వేదాధ్యయనం, తాంబూలసేవనం, దానం ఇవ్వటం, దానం తీసుకోవటం మానెయ్యాలి. దక్షిణ ఇంత కావాలని అడగటంగాని, ఇచ్చిన దక్షిణ చాలదనటంగాని కూడదు.

మాసికం అయితే 800 సార్లు, ప్రధమాబ్దికమైతే 300 సార్లు ఊనాబ్దికం అయితే 1000సార్లు, ప్రతి సంవత్సర ఆబ్దికం అయితే 100 సార్లు భోక్త గాయత్రి మంత్ర జపం చెయ్యాలి. మండలాద్యర్చనం తరువాత భోక్త మండలమునకు ఉత్తర దిక్కునుండి ఆచమనము చేయాలి. అట్లా చేస్తే అమృతముతో సమానమని కాకపోతే రక్తముతో సమానమని అంటారు.

## కర్త పాటించవలసిన నియమాలు

శ్రాద్ధానికి ముందురోజు రాత్రి కర్త భోజనం చెయ్యకూడదు. మడిగా ఫలహారం చెయ్యవచ్చును. ముందురోజున, శ్రాద్ధం రోజున బ్రహ్మచర్యం పాటించాలి. క్షౌరం, అభ్యంగనం కూడదు. తద్దినంనాడు ఉదయం చన్నీటితో స్నానంచేసి సంధ్యావందనాది నిత్యకర్మలు చెయ్యాలి. అస్వస్థుడైతే వేడి నీటి స్నానం చెయ్యవచ్చును.

భోక్తలు వచ్చిన తరువాత మళ్లీ స్నానం చేసి ఉతికి ఆరవేసిన మడిబట్టలు (పంచె, ఉత్తరీయము) ధరించాలి. పంచెలుంగీవలె మడత పెట్టి కట్టకూడదు. బిళ్ళ గోచీ పెట్టి కట్టాలి. తడిబట్టలు ధరించకూడదు. రంగుబట్టలు ముఖ్యంగా ఎర్రనివి శ్రాద్ధం పెట్టే సమయంలో ధరించకూడదు. ఆనాడు ప్రొద్దుటి నుంచీ మౌనంగా, శుభ్రమైన వస్త్రాలు ధరించి ఉపవాసం ఉండాలి (శ్రాద్ధం పూర్తి అయ్యే వరకు) ఔషధం (మందు) కూడ వేసుకోకూడదు. శ్రాద్ధం పూర్తి అయినాక పితృశేషం భుజించటం తప్ప మరోసారి భోజనం కాని, ఫలహారంగాని చెయ్యకూడదు. తాంబూలం, వేదాధ్యయనం, దానం చెయ్యటం, పుచ్చుకోవడం మానెయ్యాలి. కర్త ఏకారణం చేతనైనా అశక్తుడైతే అతని ప్రతినిధిగా తద్దినం పెట్టేవారికికూడా ఈ నియమాలన్నీ వర్తిస్తాయి (ప్రతినిధిగా పుత్రుని కూడ నియమించవచ్చు)

ఆచమనం చేశాకగాని పవిత్రం ధరించకూడదు. అర్ఘ్యం, గంధం భోక్తల కిచ్చేటప్పుడు, భోక్తల కాళ్లు కడిగేటప్పుడు, పార్వణం కలిపేటప్పుడు పవిత్రం ధరించకూడదు.

పితృశేషాన్ని కుటుంబ సభ్యులకు, అభ్యంతరం లేని దగ్గర బంధువుల (మృతవ్యక్తి దౌహిత్రులు ఇత్యాది)కు తప్ప ఇతరులకు పెట్టకూడదు. ముఖ్యంగా శూద్రులకు పెట్టకూడదు. (అట్లా చేస్తే పితృదేవతలకు నిరాశ కలుగుతుంది)

## శ్రాద్ధము రోజు పాటించవలసిన నియమాలు

శ్రాద్ధ దినములందు గదులు, హాలు మొదలైనవి ఆవుపేడతో అలికించాలి. గచ్చు అయితే కడిగించాలి. ముగ్గు పెట్టరాదు. అట్లే వీధిగుమ్మము కడగాలి. కాని ముగ్గు పెట్టరాదు. శ్రాద్ధంనాడు వేడి నీటితో స్నానము చేయకూడదు. శ్రాద్ధంనాడు ఆ గృహమందు శూద్రునికి భోజనము, శ్రాద్ధ శేషములను పెట్టకూడదు. ఒకవేళ ముందుగా శూద్రునకు పెట్టి తరువాత యజమాని తింటే పితృదేవతలు నిరాశగా వెళ్ళిపోతారు. ఆబ్దీకము రోజున అరటి చెట్టును నరకితే పితృదేవతలు ఆశారహితులై వెళ్ళిపోతారు. ముష్టి (బిచ్చము) వేయకూడదు. శ్రాద్ధముకాకుండాదేవునికి నైవేద్యము పెట్టడం పిల్లలకు ముసలివారికి తినేందుకు ఏదైనా పెట్టడం పనికిరాదు. శ్రాద్ధముపెట్టే గదిలో కత్తి పీట ఉంచకూడదు. శ్రాద్ధమునకు తెచ్చిన వస్తువులు శ్రాద్ధము పూర్తి అయ్యేవరకు యితరత్రా వాడకూడదు. గంధము సానపై అపసవ్యముగా తీయాలి. గంట మ్రోగించకూడదు. స్టవు, సిలెండరు, వంటపాత్రలు కడిగి శుభ్రపరచి వాడాలి.



## విచ్ఛిన్నౌపాసనము

ఆహితాగ్నులైన వారు ప్రతిరోజు హోమాలు చేస్తారు. అందుచేత వారిళ్లలో ఎల్లప్పుడూ ఔపాసనాగ్ని ప్రజ్వరిల్లుతూంటుంది. ఆ అగ్నిలోనే శ్రాద్ధంలోని అంశమైన అగ్నౌకరణం చేస్తారు.

ఆహితాగ్నులు కాని వారు అవసరమైనప్పుడు అగ్నిని ప్రతిష్ఠించి హోమాలు చేస్తారు. ఆ అవసరం తీరిన తరువాత ఆ అగ్ని ఆరిపోతుంది. అంటే విచ్ఛిన్నం అవుతుందన్నమాట. విచ్ఛిన్నమైన అగ్నిని తిరిగి ప్రతిష్ఠించి, అవసరమైన హోమాలు చేసి శ్రాద్ధంలో చేసే అగ్నౌకరణానికి అగ్నిని సిద్ధం చేసుకోవాలి. ముందుగా దీపారాధన చెయ్యాలి. తరువాత కర్త భార్య అగ్నిని (ఎర్రగా కాలే బొగ్గులని) ఒక ఇత్తడి పళ్లెంలో ఉంచి, దానిపైన మరొక ఇత్తడి పళ్లెం బోర్లించి అగ్నిని ప్రతిష్ఠించే స్థలానికి తీసుకువచ్చి అక్కడ ఉంచాలి. దానిని కర్త ప్రతిష్ఠిస్తాడు. అంతకుముందు కర్త స్నానంచేసి మడిగట్టుకుని విభూతి ధరించి సిద్ధంగా ఉండాలి. శ్రాద్ధం మధ్యలో దీపం ఆరిపోయినా, అగ్ని నష్టమైనా కర్త ఉపవసించి మరునాడు మళ్లీ శ్రాద్ధం పెట్టాలి.

ఔపాసన సమయంలో "ఉదీచోంగారానే నిరూహ్య"అని బహువచనంలో
ెప్పబడింది కనక అగ్నికి ఉత్తరదిక్కు నుంచి మూడుకు తక్కువ కాకుండా అగ్నికణాలు
ీసి నేతి పాత్రకు ఉత్తరంగా ఉంచి వాటిపై నేతిపాత్ర పెట్టాలి. (ఒక అంగారము
ృత్యుప్రదం, రెండు అంగారాలు మాతృహాని. కాబట్టి కనీసం మూడు
అంగారాలుంచాలి) శుభకార్యాలప్పుడు కూడా ఇదేవిధంగా చేయాలి. పరిస్తరణకు
ఉత్తరంగాను దర్వికి దక్షిణంగాను అంగారాలుంచి అక్కడే ఆజ్యపాత్రలో ఆజ్యశోధన
ెయ్యాలి. 'స్వాహా' అనే మంత్రం పూర్తిగా అన్న తరువాతనే అగ్నిలో ఆహుతి
ేయాలి. మధువు, గంధరములు అనే రాక్షసులు హోమం చేసే నేతిని దొంగిలించాలని
ప్రయత్నిస్తారట. వారిని నివారించడానికి రెండుదర్భ చివళ్లను ఆజ్యపాత్రలో ఉంచాలి
(అప్పుడు వాళ్లు ఆ పాత్రలో వస్తువు వస్త్రం అని భ్రాంతిపడి దొంగిలించే ప్రయత్నం
విరమిస్తారట) విచ్ఛిన్నౌపాసన కాగానే కర్తస్నానం చేసి మడిగట్టుకునివిభూతి
ధరించకుండా శ్రాద్ధం పెట్టాలి. కనీసం కాళ్లు, ముఖము కడుగుకొని, నెత్తిమీద
ీళ్లు చల్లుకుని విభూతి ధరించకుండా శ్రాద్ధం ఆచరించాలి.

కర్త భార్య బహిష్టుఅయినా, గ్రామాంతరంలో ఉన్నా, చాలా అనారోగ్యంతో
ఉన్నా అగ్నితే జాలదు కనుక "అయాశ్చ అనే మంత్రంతో అగ్నిసంధానం చేసి,
ప్తహోత, ప్రాతరౌపాసన మినహా తక్కిన ప్రక్రియ జరపాలి. కర్త బ్రహ్మచారి అయినా
అపత్నీకుడయినా లౌకికాగ్నిలోనే అగ్నౌకరణం చెయ్యాలి. తల్లిదండ్రులు, భార్య,
ోదరులు, పితృసోదరులు పితామహీ పితామహులు, మాతామహీ మాతామహులు
వీరికి తాను కర్త అయి ఆబ్దికాదులు పెడితే ఔపసనం చెయ్యాలి. తక్కిన సందర్భాలలో
ౌకికాగ్నిలోనే అగ్నౌకరణం చెయ్యాలి.

సోదరులు సమిష్టిగా పెట్టే ఆబ్దికం సందర్భంలో జ్యేష్ఠుడు అపత్నీకుడైతే
మ్ములలో ఎవరి భార్య అక్కడ ఉంటే వారు (క్రమపద్ధతిలో) విచ్ఛిన్నౌపాసన,
గ్నౌకరణము చెయ్యాలి. తక్కిన శ్రాద్ధమంతా జ్యేష్ఠుడే ఆచరించాలి. (యల్లాజీయం)

### కూర్చ, పవిత్రము

శ్రాద్ధ కర్త 'పవిత్రం' అనే దాన్ని ఉంగరం వేలు మీద ధరించి శ్రాద్ధం
ఆచరించాలి. అట్లాగే 'కూర్చ'ను తన జలపాత్రలో ఉంచుకోవాలి. వీటిని దర్భలతో
తయారుచేస్తారు.

మొదటి ఆబ్దికం (సాంవత్సర విమోకం తరువాత వచ్చేది) కోసం 5 దర్భలతోను ప్రతి సంవత్సరం జరిపే తద్దినానికి 7 దర్భలతోను, తీర్థశ్రాద్ధము మహాలయములకు 9 దర్భలతోను మాసికానికి 11 దర్భలతోను, సాపిండ్యానికి 12 దర్భలతోను కూర్చ తయారుచెయ్యాలి.

శ్రాద్ధం ఆచరించేటప్పుడు కర్త ఉంగరపు వేలికి పవిత్రం ధరించాలి. విచ్ఛిన్నోపాసనంకాగానే సంకల్పం చెప్పిన వెంటనే ఒక పవిత్రం ధరించాలి. భోక్తల పాదప్రక్షాళన అయిన తరువాత మండల ప్రదేశంలో మొదటి పవిత్రం విడిచి రెండవ పవిత్రం ధరించాలి. దీనిని వికిరపిండానంతరం విడవాలి. పిండ ప్రదాన ప్రారంభంలో మూడవ పవిత్రం ధరించాలి. దీనిని ఆఘ్రాణాంతంలో విసర్జించాలి. మార్జనాదియందు ధరించిన నాలుగవ పవిత్రాన్ని పిండోద్వాసన సమయంలో వదిలిపెట్టాలి. ఆసీమాంతం సమయంలో ధరించే ఐదవ పవిత్రాన్ని భోక్తలకు దక్షిణ ఇచ్చిన తరువాత వదలాలి. ప్రార్థనకు ముందుగా ధరించే పవిత్రాన్ని నమస్కారాంతంలో విడిచి పెట్టాలి. ఒక పవిత్రం విడిచాక మరొక పవిత్రం ధరించే ముందు ప్రతిసారీ ఆచమనం చెయ్యాలి.

ఈ విధంగా యజుశ్శాఖీయులు 6సార్లు పవిత్రం ధరించాలి. కాని ఆబ్దికం ఆరంభంలో రెండు పవిత్రాలనుజమిలిగా ధరించి చివరలో ఆ రెండింటిని కలిపి విడిచిపెట్టటం ఆచారంగా వస్తూంది. పవిత్రం లేకుండా చేసే ప్రక్రియలప్పుడు పవిత్రాలను జలపాత్రలో ఉంచుకొని ఆపని అవగానే తిరిగి వాటిని ధరించాలి.

పవిత్రం మొదలు 2 అంగుళాలు ముడి 1 అంగుళము అగ్రము 4 అంగుళాలు ఉండాలి. ప్రేతకర్మకు 1 దర్భతోను నిత్యకర్మలకు 2 దర్భలతోను ఆబ్దికాదులకు 3 దర్భలతోను పవిత్రం తయారుచెయ్యాలి.

## దొన్నెలు

ఆబ్దికాదులకు 11 దొన్నెలు అవసరం అవుతాయి. ఇందులో రెండు భోక్తల భోజనంలో నేతికి, ఒకటి అగ్నౌకరణం తరువాత పితృపాత్రగా ఉపయోగించటానికి, తిలలు ఉంచటానికి ఒకటి, యవలు (కడిగిన బియ్యం) ఉంచటానికి ఒకటి, విచ్ఛిన్నోపాసనలో నేతికి ఒకటి, అర్ఘ్యపాత్రలుగా అయిదు వాడాలి. ఇందులో

విశ్వేదేవస్థానంలో రెండు అర్ఘ్యపాత్రలు (దొన్నెలు) 4 అంగుళాలు పొడవుతోను, పితృస్థానంలో మూడు దొన్నెలు 5 అంగుళాలు పొడవుతోను చెయ్యాలి. మిగిలిన దొన్నెలకు కొలత నియమంలేదు. ఈ దొన్నెలు సాధారణంగా అరిటాకుని చీల్చి అందులోనుంచి రెండు ముక్కలు (పర్ణాలు) తీసుకుని మడిచి కొత్త కొబ్బరిచీపురు ముక్కలతో కుట్టాలి. లేకపోతే మర్రి ఆకులు (పూర్తి ఆకులు) వాడవచ్చు.

## వంట

శ్రాద్ధంలో భోక్తలకు వడ్డించేందుకు చేసే వంటకాలలో ఇన్ని కూరలు, ఇన్ని పచ్చళ్లు వగైరా ఉండాలని ఎక్కడా ఉన్నట్లు లేదు. కాని చాలాకాలంగా ఆంధ్ర దేశంలో ఆచారంగా పెసరపప్పు, నాలుగు కూరలు, నాలుగు పచ్చళ్లు, గారెలు, అరిసెలుగాని అప్పాలుగాని తీపివంటకం, నువ్వుండలు, బెల్లం అన్నం కలిసి చేసిన పరమాన్నం, చారు, వండటం ఆచారంగా ఉంది. ఇవి కాక పెరుగు కూడ వడ్డిస్తారు. అరటిపండుగాని, మామిడిపండుగాని, కోసే మామిడిపండు ముక్కలుగాని, అనాసపండు ముక్కలుగాని పెరుగు అన్నంతో తినడానికి వడ్డిస్తారు (ఆయా కాలాల ననుసరించి) ఉప్పుకూడా విడిగా ఏ పదార్థానికి తగులకుండా వడ్డించాలి.

మజ్జిగ పనికిరాదు. పెరుగే వడ్డించాలి. కూరలలో ఒక దుంపకూర, ఒక ఆకుకూర (తోటకూర వంటిది) ఉండాలి. కందవంటి దుంపకూర చేసినట్లయితే దుంప పూర్తిగా కొని తేవాలిగాని ముక్క కొనకూడదు (అవసరం మేరకే వాడవచ్చు) అట్లాగే పనసపొట్టు కూర చెయ్యదల్చుకుంటే పనసకాయ కొని తెచ్చి కావలసినంత పొట్టు చేసుకోవాలి గాని, చేసిన పొట్టు కొనకూడదు. కొబ్బరికాయ ఆరోజునే కొట్టాలి. పనసతొనలు వడ్డించదల్చుకుంటే పూర్తి పండుకొని తొనలు తీసి వడ్డించాలిగాని, చెక్క, తొనలు కొనకూడదు. శ్రాద్ధానికి ఉపయోగించిన కంద, పనసకాయ, పనసపండు, కొబ్బరికాయలలో మిగిలిన వాటిని శ్రాద్ధానంతరం మాత్రమే ఇతరత్రా వాడాలి. గారెలకు మినపపప్పుని ఆ రోజు ఉదయం మడిగా నానపెట్టాలి గాని ముందు రాత్రి నానబెట్టకూడదు. పూర్వం దంపుడు బియ్యం వాడే రోజులలో ఆ రోజు ఉదయం ధాన్యం దంచి ఆ బియ్యాన్నే వంటకు వాడేవారు.

ఇకపోతే కొన్ని పదార్థాలు వాడటం నిషిద్ధం. వంకాయ, ఉల్లి, వెల్లుల్లి, జీలకర్ర, పొట్లకాయ, మసాలా దినుసులు, క్యాబేజి, క్యారట్, కాలీఫ్లవర్, టొమేటో, తయారైన మరమరాలు, అటుకులు, సేమియా, సగ్గుబియ్యం వంటివి వాడకూడదు. శనగపప్పు, బొబ్బర్లు, మసూర్‌డాల్ వంటి పప్పులు వాడరు.

సాధారణంగా తోటకూర, పనసపొట్టు, అరటికాయ, కంద, చేమదుంప, దొండకాయ, బెండకాయ, కాకరకాయ, ఆగాకరకాయ, చిక్కుడుకాయ వంటివి కూరలకు, కొబ్బరికాయ, నువ్వు పప్పు, అల్లం, మామిడికాయ, దోసకాయ, బలుసుకూర, నిమ్మకాయ (దబ్బకాయ పనికిరాదు) ఎండిన వేపపువ్వు వంటివి పచ్చళ్లకు వాడతారు. పెసరపప్పు వండి కొంచెం ఉప్పువేసి వడ్డిస్తారు గాని కలగలుపు పప్పు చెయ్యరు. పోపులో ఆవాలు, మినపప్పు, ఎండుమిర్చి మాత్రమే వాడతారు. చింతపండు వాడతారు గాని పులుసు కాచరు. చారుమాత్రమే కాస్తారు. దేశాచారాన్ని బట్టి ఏయే కూరలు, పప్పులు వాడకూడదో, ఏవి వాడవచ్చో తెలుసుకుని వంట చెయ్యాలి.



కర్త భార్య వంట చెయ్యటం శ్రేష్ఠం. ఆరోగ్య కారణాలవల్లగాని, బహిష్ఠు అయ్యే అనుమానం ఉంటేగాని వేరొకరిని నియమించుకోవచ్చు. సకేశ అయిన వితంతువు, కన్య వంటకు పనికిరారు. వంట ప్రారంభం మాత్రం కర్త భార్య చెయ్యటం ఉత్తమం. అట్లాగే వడ్డన కూడా వీలైతే కర్త భార్య చెయ్యటం ప్రశస్తం. ఈ సమయంలో వంట చేసేవారు శిరస్నానం చేసి (కచ్చాపోసిగాని, గోచీగాగాని) తెల్లమడి చీర ధరించి బొట్టు పెట్టుకోకుండా ఉండాలి. భోక్తలవిస్తళ్లు తీసేందుకు పురోహితుడి సూచించినప్పుడు బొట్టు పెట్టుకుని విస్తళ్లు తీయాలి.

పితృశేషం తినకూడని వారికి వంటకాగానే కొంతభాగం ప్రోక్షణకు పూర్వమే వేరు చేసి దానిని వారికి వడ్డించాలి.

## కర్త, భోక్తలు చెప్పవలసిన మంత్రాలు

ఆబ్దికంలో పురోహితుడు చెప్పే మంత్రాలన్నీ నిజానికి కర్త చెప్పవలసినవే. ఇది కష్టం కనుక పురోహితుడు చదువుతుంటే కర్త తానంటున్నట్లే భావించుకోవాలి. ప్రత్యేకంగా కొన్నిచోట్ల మమ, మయాక్రియమాణేన, అస్మత్ పితుః (మాతుః)

యుష్మదనుజ్ఞయా వంటి మాటలు కర్తచేత చెప్పిస్తారు. ఇవికాక కొన్నిచోట్ల కర్త ఒకభోక్తతోగాని, ఇద్దరు భోక్తలతో సమిష్టిగా గాని అనవలసిన మంత్రాలు, వాటికి వారు చెప్పవలసిన ప్రతివచనాలు ఉంటాయి. వాటిని ఈ కింద పొందుపరుస్తున్నాము.

**భోక్తలు కలిసి ప్రతవిచనం చెప్పే మంత్రాలు :**

1. కర్త : ప్రాయశ్చిత్తం కరిష్యే - భోక్తలు : కురుష్వ

2. అధికార సంపదస్త్వితిభవంతో బ్రువంతు - అధికార సంపదస్తు

3. ప్రక్రాంతం శ్రాద్ధ కర్మ కరిష్యే - కురుష్వ

4. అన్నసూక్త మంత్ర పఠనం కరిష్యే - కురుష్వ

5. బ్రాహణైస్సహ ఆశ్రావయిష్యే - ఆశ్రావయ

6. దేశకాలపాత్ర .... అచ్ఛిద్రమస్త్వితిభవంతో బ్రువంతు

సర్వం న్యూనాతిరిక్తాభ్రామచ్ఛిద్రమస్తు

7. యధాసుఖం జుషధ్వం - జుషావహై

8. బ్రాహ్మణ భోజన పర్యంతం అధిశ్రవణ మంత్ర పఠనం కరిష్యే, మహాజనైస్సహ ఆశ్రావయిష్యే - ఆశ్రావయ

9. పునరావృత్తి రహిత శాశ్వత బ్రహ్మలోక నిత్యనివాస సిద్ధిరస్త్వితి భవంతో బ్రువంతు - శాశ్వత బ్రహ్మలోక నివాస సిద్ధిరస్తు

పిండప్రదానం కరిష్యే - కురుష్వ

10. గయాపిండ సదృశాభవం త్వితిభవంతో బ్రువంతు - గయాపిండ సదృశాభవంతు

11. అపఃపిండానుద్ధారయిష్యే - ఉద్ధారయ

12. అస్మద్గోత్రం వర్ధతామ్ - స్వస్తివర్ధతామ్ గోత్రం

13. భోజనపాత్రానుచ్ఛాలయిష్యే - ఉచ్ఛాలయ

14. దాతారోనో అభివర్ధంతామ్ - మాచయా చిష్మకంచన

దాతారో - మాచయా చిధ్వంకంచన

15. అన్నశేషః కిం క్రియతామ్ - ఇష్టై స్సహ భుజ్యతామ్

16. శ్రాద్ధం మయాచరితం యథోక్త మస్త్వితి భావంతో బ్రువంతు - యథోక్తమస్తు

17. ఆ సీమాంత మనువ్రజే - అనువ్రజ

దీని తర్వాత భోక్తలు ఆశీర్వచన మంత్రం చెప్పాలి. భోక్తలతో వేరువేరుగా చెప్పేవి - వాటి ప్రతివచనాలు

**విశ్వేదేవస్థానభోక్త :**

1. భవద్భిః క్షణః ప్రసాదః కరణీయః - అస్తుకరణీయః

2. స్వాగతం - సుస్వాగతం

3. పాద్యస్థానే ఇదమాసనం - సుఖాసనం

4. ఇదంవః పాద్యం - సుపాద్యం

5. అత్రోపవిశంతు భవంతః - అత్రోపవిశామ

6. శ్రాద్ధ యోగ్యాభవంత్వితి భావంతో బ్రువంతు - శ్రాద్ధయోగ్యాభవంతు

7. తతః శ్రాద్ధం ప్రవర్తయే - ప్రవర్తయ

8. ఇదమాసనం - సుఖాసనం

9. ప్రాప్నువంతు భవంతః - ప్రాప్నువామ

10. భవత్స్వావాహయిష్యే - ఆవాహయ

11. సావధానాభవంతుతే - సావధానాస్మః

12. ఇదం వో అర్ఘ్యం - అస్త్వర్ఘ్యం

13. అమీగంధాః - సుగంధాః

14. ఇమాని పుష్పాణి - సుపుష్పాణి

15. అయంవోధూపః - సుధూపః

16. అయంవో జ్యోతిః - సుజ్యోతిః

17. ఇదం వో వాసః - సువాసః

18. విశ్వేదేవతాస్తుష్టావరదాభవంతు - తుష్టావరదాభవామి

19. యుష్మదనుజ్ఞ యాపిత్రా (మాత్రో) ద్యర్చనం కరిష్యే - కురుష్వ

పితృస్థాన భోక్త వద్ద కూడా ఇవే మంత్రాలు వస్తాయి కాని 12లో "ఇదంతే ర్ఘ్యం" అని, 18లో "పితృదేవతాస్తుష్టా వరదాభవంతు" అని 19లో "యుష్మదనుజ్ఞ యా అన్నసంస్కారార్థం అగ్నౌకరణం కరిష్యే" అని వస్తుంది. ప్రతి వచనాలు మారవు.

## ఆచమనము

**ర్త ఆచమనం చెయ్యవలసిన సందర్భాలు :**

1. ఆబ్దికం మొదట రెండు సార్లు

2. భోక్తల పాదాలు కడిగిన తరువాత తనకాళ్లు కడుగుకొని బయట ఒకసారి ోపలికి వచ్చి తదుపరి సంకల్పానికి ముందు ఒకసారి.

3. విశ్వేదేవార్చన అనంతరం ఒకసారి

4. పిత్రా (మాత్రా) ద్యర్చన అనంతరం ఒకసారి

5. అన్నం వాసన చూసిన తరువాత ఒకసారి

6. వికిరపిండదానము తరువాత ఒకసారి

7. ఆబ్దికం పూర్తి అయిన తరువాత కాళ్లు కడుగుకొని రెండుసార్లు.

**ోక్తలు ఆచమనం చేసే సందర్భాలు :**

1. పాదప్రక్షాళనానంతరం రెండు సార్లు

2. భోజనానంతరం రెండు సార్లు

## పాద్యము

పాదం మొదటి భాగం పితృస్వరూపమని, మధ్యభాగం పితామహ స్వరూపమని, వరి భాగం (కాలి వేళ్లుండే భాగం) ప్రపితా మహస్వరూపమని చెప్పబడింది కాబట్టి వరుసలో కాళ్లు కడగాలి. పాదప్రక్షాళనకు ముందు ఆవుపేడలో ఆవు నెయ్యి లిపి భోక్తల పాదాలకు రాయాలి. అప్పుడు పితృదేవతలు కల్పాంతం వరకు మృతంతో అభిషేకించబడిన వారవుతారు. గ్రంథాలలో ఇట్లా ఉన్నప్పటికీ ఎవరూ

దీనిని పాటించడంలేదు. భోక్తల కాళ్లు కడిగేటప్పుడు పవిత్రం తీసేయాలి. ఈ కార్యక్రమం ఇంట్లో ఉన్న బయలు ప్రదేశంలో (పైకప్పు లేని చోట) గాని గుమ్మం ముందుగాని చెయ్యాలి. పాదప్రక్షాళనకు పూర్వం రెండు మండలములుగా ఆవు పేడతో అలకాలి. మొదట చతురస్రాకారంగా దేవమండలాన్ని తరువాత దానికి దక్షిణంగా ఆరు అంగుళాల స్థలం వదలి గుండ్రంగా పితృమండలాన్ని నిర్మించాలి. ఈ మండలాల పరిమాణంకూడా ఆరేసి అంగుళాలుండాలి. కర్త సవ్యంగా ఉండి దేవమండలాన్ని ప్రదక్షిణ క్రమంలోను (గడియారం ముల్లు తిరిగే విధంగా చెయ్యి తిరగాలి) పితృమండలాన్ని ప్రాచీనావీతిగా ఉండి అప్రదక్షిణంగాను అలకాలి. విశ్వేదేవమండలం మీద తూర్పు అగ్రంగా అక్షతలతోను, పితృమండలంమీద దక్షిణాగ్రంగా తిలలతోను దర్భలను ఉంచాలి. ప్రక్షాళన సమయంలో విశ్వేదేవభోక్త తూర్పు ముఖంగాను, కర్త పడమర ముఖంగాను ఉండాలి. పితృస్థానభోక్త ఉత్తరముఖంగా ఉండగా కర్త దక్షిణ ముఖంగా ఉండి పాదప్రక్షాళన చెయ్యాలి. ప్రక్షాళన సమయంలో భోక్తల కాళ్లు ఆయామండలాలపైన ఉండాలి. ఒకరి కాళ్లు కడిగిన నీళ్లు మరొకరి కాళ్లు కడిగిన నీళ్లు కలవకూడదు. కనుక మండలంమీద ఇత్తడి పళ్లెం ఉంచి కాళ్లు కడగాలి. భోక్త కాళ్లు కడిగాక ఆతని కాలిబొటనవేళ్లకు నెయ్యి రాసి నీళ్లుచల్లి ఆ నీళ్లను కర్త శిరస్సుపై చల్లుకోవాలి. ఇది అన్ని ప్రాంతాలలోను ఆచారంగా ఉన్నది. షోడశ సపిండీకరణాలలో మాత్రం నెయ్యి రాయకుండానే బొటనవేళ్లపై కాళ్లు చల్లి ఆ నీళ్లు శిరస్సుపై చల్లుకోవాలి. ఈ ప్రక్షాళన కార్యక్రమం కర్త, భోక్తలు కూర్చునే జరపాలి. భోక్త కర్త చేతిని తాకియే ఉండాలి.

భోక్తల కాళ్లు కడిగిన తరువాత కర్త తనకాళ్లు కడుక్కోవాలి. అనంతరం పవిత్రం ధరించి దేవమండలానికి ఈశాన్యంగా కూర్చుని ఆచమనం చెయ్యాలి. అంతకు ముందే పాత్రలో వేరే నీళ్లు తీసుకోవాలి. అనంతరం భోక్తల పితృస్థాన దేవమండలానికి ఉత్తరంగాను, విశ్వేదేవభోక్త మండలాలకు తూర్పుగాను కూర్చుని ఆచమనం చెయ్యాలి. కర్త ఆబ్దికం జరిపే స్థలానికి వెళ్లి ఆచమనం చేసి కొత్త పవిత్రం ధరించాలి. అనంతరం భోక్తలు ఆచమనం చెయ్యాలి.

## ఆసనములు

విశ్వేదేవ స్థాన భోక్త తూర్పుముఖంగాను, పితృస్థాన భోక్త ఉత్తర ముఖంగాను
వారి కోసం వేసిన) పీట వెనకాల నిలబడాలి. విశ్వేదేవ స్థానంలోని పీటపైన
ండు దర్భలు తూర్పు అగ్రంగాను, పితృస్థానంలోని పీటపైన ఒక దర్భ
క్షిణాగ్రంగాను వెయ్యాలి పీటలకు మేకులుండకూడదు. (ప్లాస్టిక్ పీటలువాడవచ్చు
ేదా దర్భాసనాలు వాడవచ్చు) మొదట విశ్వేదేవస్థాన భోక్తను సవ్యంగాను తరువాత
ితృస్థాన భోక్తను అపసవ్యంగాను వారి పీటల మీద కూర్చోబెట్టాలి. బొటనవేలు
దలి మిగిలిన వేళ్లతో భోక్త కుడి చెయ్యి పట్టుకుని కూర్చోబెట్టాలి. విష్ణుస్థాన భోక్తను
ూడా విశ్వేదేవస్థాన భోక్తవలెనే కూర్చోబెట్టాలి.

భోక్తలు కూర్చున్న తరువాత తిరిగి సంకల్పము చెప్పుకొని అనంతరం వండిన
దార్థాలపై అభిమంత్రించిన జలాన్ని చల్లాలి. దీనివల్ల వాటికి శ్రాద్ధ యోగ్యత
లుగుతుంది. ఈ ప్రోక్షణ తరువాత కర్తకు ఆశౌచవార్త ఏదైనా తెలిసినా ఆ ఆశౌచం
ాద్ధం పూర్తి అయ్యేవరకు అంటదు. భోక్తలకు వడ్డనమాత్రం ఆశౌచం లేనివారు
ెయ్యాలి. అప్పుడు అర్చన ప్రారంభించాలి. విశ్వేదేవస్థానంలో అర్చన చేసేటప్పుడు
ుడిమోకాలు నేలపై ఆన్చి ఎడమపాదం పూర్తిగా నేలపై ఆన్చి ఉత్తరముఖంగా
ూర్చోవాలి. పితృస్థానంలో అర్చనకు ఎడమమోకాలు, కుడిపాదం నేలపై ఆన్చి
క్షిణముఖంగా కూర్చోవాలి.

## అర్ఘ్యపాత్రలు

విశ్వేదేవస్థానంలో రెండు, పితృస్థానంలో మూడు అర్ఘ్యపాత్రలు వాడాలి.
ిశ్వేదేవ స్థానంలో దొన్నెలు నాలుగంగుళాలు పొడవుగాను, పితృస్థానంలో దొన్నెలు
అయిదంగుళాలు పొడవుగాను ఉండాలి. అర్చనలో మొదట వాటిని బోర్లించాలి.
ిశ్వేదేవస్థానంలో తూర్పు ముఖంగా అగ్రం ఉన్న రెండు దర్భలపై రెండు,
ితృస్థానంలో దక్షిణ ముఖంగా అగ్రాలున్న మూడు దర్భలపై మూడు అర్ఘ్యపాత్రలను
ోర్లించాలి. తరువాత వీటిని ఒకొక్క దానిని తిరగేసి అష్టార్ఘ్యాలతో నింపి (దీని
అంతటికీ మంత్రాలుంటాయి) ఆ తరువాత ఆయా విశ్వేదేవతల పేరుమీద విశ్వేదేవ
స్థాన భోక్తకు, ఆయా పితృదేవతల పేరిట పితృస్థాన భోక్తకు (పవిత్రం విడిచి)

అర్ఘ్యం ఇయ్యాలి. నీళ్లు కారిపోకుండా అర్ఘ్యపాత్రలు దృఢంగా ఉండాలి. అర్ఘ్యోదకం కింద పడకుండా కింద పళ్లెం ఉంచాలి. అర్ఘ్యం తరువాత భోక్తను ఆవాహన, పుష్ప, గంధ, వస్త్రాదులతో అర్చించాలి. విశ్వేదేవస్థాన భోక్తను సవ్యంగాను, పితృస్థాన భోక్తను ప్రాచీనావీతిగాను అర్చించాలి. కాని గంధం ఇచ్చేప్పుడు మాత్రం పవిత్రం తీసి సవ్యం చేసుకోవాలి. ముఖ్యంగా అర్ఘ్యం ఇచ్చే సమయంలో భోక్తలకు శుద్ధోదకం (కూర్చోదకం) ఇచ్చే ప్రతిసారీ ముందుగా ఎడమచేతితో కూర్చ పట్టుకుని తన కుడిచేతిని శుద్ధి చేసుకొని తరువాత కుడిచేతితో కూర్చ పట్టుకుని భోక్త చేతిని శుద్ధి చెయ్యాలి. అర్ఘ్యం ఇచ్చేప్పుడు అర్ఘ్యపాత్రపై (మూతగా) ఉంచిన దర్భను కర్త పట్టుకోవాలి. పాత్ర కింది దర్భను భోక్త పట్టుకోవాలి. ప్రతిసారీ అర్ఘ్యం ఇచ్చాక ఖాళీ అర్ఘ్య పాత్రను విశ్వేదేవ స్థానంలో అయితే పీటకు కుడివైపున, పితృస్థానంలో అయితే ఎడమవైపునా ఒకదర్భపై బోర్లించాలి. ఈ దొన్నెలు ఇతర దొన్నెలతో కలవకూడదు.



## అగ్నౌకరణము

అర్చన తరువాత అగ్నౌకరణం చెయ్యాలి. పాత్రలో (విస్తరిలో) అన్నం ఉంచి దానిని దర్భలతో నాలుగు భాగాలుగా చెయ్యాలి. ఆగ్నేయ భాగాన్ని హోమం చెయ్యటానికి, నైరృతి భాగాన్ని పితృపాత్ర (దొన్నె)లో ఉంచటానికి, వాయవ్య భాగాన్ని వికిరపిండం చెయ్యటానికి, ఈశాన్య భాగాన్ని పార్వణంలో కలపటానికి ఉపయోగించాలి. ఇందులో ఒక మెతుకు కూడా భోక్తల పాత్రల (విస్తళ్లు)లోకి వెళ్లకూడదు.

## వడ్డన

ముందుగా విశ్వేదేవ స్థానంలో పీటకెదురుగా గల నేలపై నలుచదరంగా నీటితో ప్రదక్షిణంగా అలకాలి (కాళ్లు కడిగే ముందు మంటపం అలికినట్లే) నైరృతి దిక్కున ప్రారంభించి ఈశాన్యం వరకు అలకాలి. ఈ ప్రక్రియ అంతా సవ్యంగా ఉండి చెయ్యాలి. ప్రాచీనావీతి అయి పితృస్థానంలో పీటకెదురుగా గుండ్రంగా అప్రదక్షిణంగా ఈశాన్యం నుంచి నైరృతి పర్యంతం అలకాలి. అప్పుడు విస్తళ్లు వెయ్యాలి. అరటి ఆకులు ప్రశస్తం. ఇవి కొనలున్న వాటినే వాడాలి. కొనలు

యాభోక్తలకు ఎడమవైపు వచ్చేటట్లు అడ్డంగా వెయ్యాలి. ఉపపాత్రలు కూడా
ంచాలి ఆకుల చుట్టూ శుద్ధోదకాన్ని విశ్వేదేవస్థానంలో సవ్యంగాను, పితృస్థానంలో
పసవ్యంగాను చల్లాలి. ముందు పితృస్థానంలో చల్లాలి. ఆపైన ఆచమనం చేసి
ద్ధి చేసుకోవాలి.

ముందుగా ఒక పళ్లెంలో అన్నాన్ని తీసుకొని వచ్చి భోక్తల విస్తళ్ల నడుమ
ంచాలి. పితృస్థానంలో భోక్తకు ప్రాచీనావీతిగా హస్తోదకం ఇచ్చి విస్తరిని
గ్నౌకరణంలో మిగిలిన నేతితో అభిఘరించి కొంచెం అన్నాన్ని కుడిచేతితో తీసుకుని
స్తరిలో "స్వధేయం" అని మూడు సార్లు చెబుతూ మూడుసార్లు ఉంచాలి. మళ్లీ
భిఘరించి భోక్తకు హస్తోదకం ఇచ్చి సవ్యం చేసుకొని విశ్వేదేవ స్థానభోక్తకు
ాస్తోదకం ఇయ్యాలి. ఆయన విస్తరికి, అన్నం పళ్లానికి అభిఘారం చెయ్యాలి. ఆ
రువాత (పురోహితుడు చదివే) అన్న సూక్తమంత్రం విన్నాక తదుపరి వడ్డన
వడ్డించేవారు) కొనసాగించాలి. వడ్డన కర్తగాని, అతని భార్యగాని, మడిగా ఉన్న
ంరొకరు గాని చెయ్యవచ్చు.

ముందుగా అన్నం విస్తరిలో మధ్యగా వడ్డించాలి. తరువాత కుడివైపున పప్పు,
రమాన్నము, ఎడమ వైపున భక్ష్యాలు (గారెలు, అప్పాలు వంటివి) వడ్డించాలి.
రువాత మిగిలిన వంటకాలు వడ్డించాలి వీటికి ప్రత్యేక క్రమంగాని, ప్రత్యేక స్థల
యమంగాని లేదు. దొన్నెలలో నేతి నుంచి ఆ దొన్నెలను విస్తళ్లకు అవతలగా,
గ్గరగా పెట్టాలిగాని విస్తళ్లలో పెట్టకూడదు. (అట్లా చేస్తే ఆ భోజనం రాక్షస భోజనం
వుతుంది) నెయ్యి, అన్నము, కూరలు, పచ్చళ్లు, పరమాన్నం, చారు, పప్పు, లవణం,
రుగు వంటివి గరిటతోను, భక్ష్యాలు చేతితోను వడ్డించాలి. ఏ పదార్థమైనా పాత్రను
ోక్త ముందుకు తెచ్చి అందులో నుంచి విస్తరిలో వడ్డించాలి. స్టీలు పాత్రలు పనికి
ావు. స్త్రీ వడ్డించేట్లయితే తెల్ల వస్త్రం ధరించి వడ్డించాలి. ముఖ్యంగా ఎర్ర వస్త్రం
నికిరాదు. అరటిపండు వంటి ఫలాలను తొక్క తీసి చేతితో వడ్డించాలి. వంటకాలన్నీ
ోజనానికి ముందుగా ఒకసారి వడ్డించాలి. ఉపపాత్రలో కొద్దిగా పెరుగు దానికి
ాకకుండా ఉప్పు వడ్డించాలి. భోజనం మధ్యలో ఏ పదార్థాన్నయినా భోక్త ఎదటికి
చ్చి కావాలా అని అడగాలి కాని, వట్టి చేతులతో ఉండి అది కావాలా, ఇది
ావాలా అని అడగకూడదు.

## అన్నపరివేషణము

భోక్తలకు వంటకాలన్నీ వడ్డించిన తదుపరి కర్త నివీతిగా (జంధ్యాలు దండవలె ధరించి) విశ్వేదేవస్థానం విస్తరి చుట్టూ దర్భలు, బియ్యం చల్లాలి. తరువాత ప్రాచీనావీతిగా పితృస్థానం విస్తరి చుట్టూ దర్భలు, నువ్వులు చల్లాలి. నువ్వులు విస్తర్లలో పడకూడదు. గాయత్రీ మంత్రంతో నీటిని అన్నం మీద ప్రోక్షించి, తరవాత ఊరకే చుట్టూ చల్లి విశ్వేదేవ స్థానం విస్తరిని ఎడంచేతి మధ్య వేలుతో తాకుతూ కుడిచేత్తో భోక్త కుడిచేతిని, బొటనవేలు (గోరు) విడిచి పట్టుకుని పురోహితుని సూచన ప్రకారము భోక్త చేతిని అన్నం చుట్టూ ప్రదక్షిణంగా తిప్పాలి. భోక్త బొటనవేలు అన్నానికి తాకించాలి (అంతవరకూ భోక్త అన్నాన్ని తాకకూడదు) యవలతో నీటిని కుడిచేత్తో విస్తరికి ఎడమవైపు నేలమీద విడవాలి. అటుపైన ఉపస్థానం చెయ్యాలి.

తరువాత ప్రాచీనావీతిగా పితృస్థాన భోక్తకు హస్తోదకం ఇచ్చి ఆయన కుడిచేతిని కర్త కుడిచేత్తో పట్టుకుని (బొటనవేలు వదలి) తన ఎడమచేతిని కుడిచేతి మీదుగా పోనిచ్చి మధ్య వేలితో విస్తరిని తాకాలి. పురోహితుని సూచన ప్రకారం భోక్త చేతిని అన్నం చుట్టూ అప్రదక్షిణంగా తిప్పి అతని బొటనవేలుని అన్నానికి తాకించాలి. తరువాత తిలలు, కుశలతోపాటు జలాన్ని విస్తరికి కుడివైపున వదలాలి. అటుపైన ఉపస్థానం ఒక్కసారే చెయ్యాలి. అనంతరం తిలోదకం తరువాత తిలలు కుశలు వదలాలి. తరువాత సవ్యం చేసుకుని పదిసార్లు గాయత్రీ మంత్ర జపం చెయ్యాలి.

## భోక్తల భోజనము

మొదట పితృస్థానంలోను, తదుపరి విశ్వేదేవస్థానంలోను విస్తరిపై గాయత్రితో ప్రోక్షించడానికి, ఆ తరువాత పరిషేచనం చెయ్యడానికి (సత్యంత్వర్తేన పరిషించామి) భోక్తల చేతిలో నీరు కర్త పొయ్యాలి. అప్పుడు ప్రాచీనావీతిగా పితృస్థానంలోను సవ్యంగా విశ్వేదేవస్థానంలోను హస్తోదకం ఇవ్వాలి. తరువాత పితృస్థానంలో మూడు సార్లు 'అమృతమస్తు' అంటూ ఉదకం ఇవ్వాలి. విశ్వేభ్యోదేవేభ్యో అమృతమస్తు అంటూ ఒకసారి విశ్వేదేవ బ్రాహ్మణుని చేతిలో ఉదకం ఇవ్వాలి. భోక్తలు ప్రాణాహుతులు తీసుకున్నాక వారి ఎడమచేతి వేళ్లు కడిగేందుకు ఉదకం పొయ్యాలి. మొహమాట పడకుండా తృప్తిగా తినమని వారిని ప్రార్థించాలి. (దీనికి కూడా మంత్రం ఉంటుంది.)

భోక్తలు భోజనం చేసేటప్పుడే పార్వణానికి మినుము వాడని వంటకాలన్నీ ఒక విస్తరిలో తీసుకుని, పవిత్రం విడిచి, పార్వణం బాగా కలిపి, మూడు పిండాలుగా చెయ్యాలి. ఒక తెల్లని మెతుకు, కొంచెం పిండ శేషం ఉండేటట్లు చూసుకోవాలి. చేతులు కడుగుకొని పవిత్రం ధరించి తదుపరి కార్యక్రమం కొనసాగించాలి. భోక్తల భోజనం పూర్తి అయినాక (అగ్నౌకరణం అప్పుడు) అన్నం ఉంచిన పితృపాత్రలో నీళ్లు పోసి ప్రాచీనావీతిగా ఆతడి అన్నంలో కొంత పితృస్థానం విస్తరికి ఎడం పక్కగానుంచి చుట్టూ నీటితో పరిషించాలి. సవ్యం చేసుకుని మిగిలిన అన్నాన్ని విశ్వేదేవస్థానం విస్తరికి ముందుగా వదలాలి. ప్రాచీనావీతిగా దేవ పితృ మధ్య స్థలంలో విస్తళ్లకు ఆరు అంగుళాల దూరంలో దక్షిణాగ్రాలుగా దర్భలుంచి వాటిపై (వికిర) పిండాన్ని (అగ్నౌకరణంలో వాయవ్యభాగం) ఉంచి మార్జనం చేసి తిలోదకం చల్లాలి. అప్పుడు సవ్యం చేసుకుని కర్త పాదాలు కడుక్కుని ఆచమనం చెయ్యాలి. తరువాత భోక్తల ఉత్తరాపోశనానికి వారి చేతిలో నీరు ఇవ్వాలి. భోక్తలు చేతులు కడుగుకోవడానికి బయటకు వెళ్తారు. చేతులు, కాళ్లు కడుక్కున తరువాత భోక్తలు రెండుసార్లు ఆచమనం చెయ్యాలి.



## పిండ ప్రదానము

భోక్తలు లేచి చేతులు కడుక్కోవడానికి వెళ్లాక కర్త సంకల్పం చెప్పుకొని విస్తళ్లకు బాహు (సుమారు 30 అంగుళాలు) దూరంలో ప్రాచీనావీతిగా దక్షిణంవైపు కొసలుండేటట్లు దర్భలుంచి వాటిపై పితృ, పితామహ, ప్రపితామహుల (మాతృ, పితామహీ, ప్రపితామహి) ప్రతినిధులుగా వసురుద్ర ఆదిత్య రూపాలుగా (పార్వణంతో చేసిన) మూడు పిండాలని ప్రతిష్ఠించాలి. ఈ పిండాలు కొబ్బరికాయంత ప్రమాణంలో ఉండాలి. (ఉసిరికాయంత చాలునని వ్యాసుని అభిప్రాయం.) ఈ దర్భలు 21 అంగుళాలు పొడవుండాలి. ఆబ్దికానికి 7, మాసికానికి 11 వాడాలి. పిండాలను పురోహితుని సూచన ప్రకారం అర్చించాలి. అనంతరం సవ్యం చేసుకుని పార్వణ పూజ చెయ్యాలి. పూజ చేసి ఒకతీపి భక్ష్యాన్ని నైవేద్యం పెట్టాలి (ఆ ప్రసాదం కర్త భోజనంలో తినాలి). అనంతరం ప్రాచీనావీతి అయిపిండాలకు నమస్కరించి, మధ్య పిండాన్ని ఒకమారు ఎత్తి మళ్లీ అదే స్థానంలో ఉంచి చివరకు మూడు పిండాలను

పిండపూజలో సమర్పించిన వస్త్రంలో కట్టాలి. సవ్యం చేసుకుని పిండ స్థానంలో కుశలు, అక్షతలు చల్లాలి.

### ఆసీమాంతం

బయట భోక్తలవద్దకు వెళ్లి ముందు విశ్వేదేవ బ్రాహ్మణునికి హస్తోదకం ఇచ్చి, దర్భలు, అక్షతలు ఇయ్యాలి. ప్రాచీనావీతిగా పితృస్థానంలో హస్తోదకం ఇచ్చి, దర్భలు, అక్షతలు ఇవ్వాలి. సవ్యం చేసుకుని వారి ప్రసాదం స్వీకరించాలి (అక్షతలు). భోజనపాత్రన్యుచ్చారయిష్యే అనే మంత్రం కాగానే భోక్తల విస్తళ్లు ఎత్తించాలి. మగవారుకూడా తీయవచ్చు. కర్త భార్యగాని, ఇతర పుణ్యస్త్రీగాని విస్తళ్లు తీసేటట్లయితే నుదుట కుంకుమ ధరించి తియ్యాలి. ఈ విస్తళ్లను గోయి తీసి గోతిలో పాతి పెట్టాలి. అంతకుముందు వికిరపిండాన్ని ఆరు బయట కాకులకు కనపడేటట్లుగా పెట్టాలి. విస్తళ్లు ఎత్తిన తరువాతనే భోక్తలు ఆశీర్వచనం చెయ్యాలి. తండ్రి ఉండగా తల్లి శ్రాద్ధం జరిపేటప్పుడు ఈ తిలతర్పణం తండ్రి చెయ్యాలి. అనంతరం ఆచమనం చేసి సంకల్పం చెప్పుకుని పితృదేవతలకు ప్రాచీనావీతిగా శ్రాద్ధాంగ తిలతర్పణం చెయ్యాలి. ఈ తిలతర్పణం మరునాడు ఉదయం చెయ్యవలసినది అయినా దేశ కాల వైపరీత్య శంకవల్ల అప్పుడే చేయటం జరుగుతుంది. మాసికాదులలో శ్రాద్ధాంగ తర్పణం అక్కరలేదని కొందరి అభిప్రాయం. కాని పరేహనా కర్తవ్య అని చెప్పకుండా తిలతర్పణం చెయ్యాలి. అనంతరం నివీతిగా యజ్ఞోపవీతాల బ్రహ్మముడులపై నీళ్ళధార పోసి, బ్రహ్మముడులను పిండి కళ్లకద్దుకోవాలి. సవ్యం చేసి ఆచమనం చెయ్యాలి. భోక్తలకు తాంబూలంతోపాటు దక్షిణ ఇచ్చి సాగనంపాలి. పితృస్థాన భోక్తకు ప్రాచీనావీతిగా ఉండి దక్షిణ ఇయ్యాలి.

వికిర పిండాన్ని కాకులు తింటే పితృదేవతలకు ఏ కోరికలూ లేనట్లు భావిస్తారు. పార్వణాన్ని ఆవుకు పెట్టడంగాని, అగ్నిలోహుతం చెయ్యటంగాని, నది, పంటకాలువ, చెరువు వంటి చోట కలపడంగాని చెయ్యాలి. నీటిలో కలిపేటప్పుడు దర్భలు నీటిలో పడకూడదు. తరువాత కర్త తన కుటుంబ సభ్యులతోను, జ్ఞాతులతోను కలిసి పితృశేషాన్ని భుజించాలి. మృతునితో ఏ విధమైన ఆశౌచ సంబంధం లేనివారు పితృశేషం తినకూడదు. పితృశేషం తిన్న వారంతా మరునాడు స్నానం చేయాలి.

## ధర్మసూక్ష్మాలు

1. తల్లిదండ్రులలో ఎవరైనా మృతి చెందినపుడు కుమారులు విభక్తులైనప్పటికీ సపిండీకరణం కలిసే చెయ్యాలి. తదుపరి ఊనమాసికం నుంచి మాసికాదులు త్యాబ్దికాలు విడివిడిగా ఆచరించవచ్చు. విభక్తులు కాకపోయినా వేర్వేరు దేశాలలో ంచేవారయితే మాసిక ప్రత్యాబ్దికాలు విడివిడిగా పెట్టవచ్చు. విభక్తులైన సోదరులు దండ్రులకు మాసిక, ఆబ్దికాదులు విడిగానే పెట్టాలని కొన్ని గ్రంథములలో ప్పటికీ, వీలైనప్పుడు కలిసిపెట్టడం ఆచారంగా వస్తూంది. ఆబ్దిక సమయానికి డు.

2. అస్వస్థుడైనా, అతనికి మాత్రమే ఆశౌచం వచ్చినా తక్కినవారు పెట్టాలి. స్థుడు స్వస్థత (శుద్ధి) చెందాక పెట్టాలి. తానొకడే శ్రాద్ధ కర్త అయి, ఆబ్దికంనాడు స్థుడైతే తనకుమారునికి అనుమతి ఇచ్చి అతనిచే ఆబ్దికం జరిపించవచ్చు.

3. తాత (మాతామహుడు) అమ్మమ్మ, సవతితల్లి, మేనత్త, అత్తమామలు, తల్లి పెదతల్లి, భార్య, సోదరీ సోదరులు, వీరిలో ఎవరికైనా కొడుకులు లేక ం కర్త అయితే వారి ఆబ్దికాలు పార్వణ విధానంగానే జరపాలి. తాత, అమ్మమ్మ తక్కినవారికి ఏకోద్దిష్ట విధానంలో జరపాలని కొందరి అభిప్రాయం. దేశాచారాన్ని ఆచరించాలి.

4. తల్లిదండ్రులు, తాత, అమ్మమ్మలు - వీరి ఆబ్దికంలో పిండ పితృదేవతల దాన్ని కర్త తప్పకుండా తినాలి. కర్త వేరేవారై ప్రతినిధి ఆబ్దికాన్ని జరుపుతున్నా మాత్రం తప్పక ప్రసాదం తినాలి. అటువంటి కర్త అక్కడ లేకపోతే నైవేద్యానికి లు నీరు వదలాలి.

5. తల్లిదండ్రులలో ఎవరి ఆబ్దికం నాడైనా మరొకరికి తాను కర్తగా ఆబ్దికం వలసి వస్తే ఆఇతరుల ఆబ్దికాన్ని వేరే ఎవరిచేతనైనా పెట్టించాలి. తల్లిదండ్రుల కం ఒకేతిథి అయితే ముందుగా తండ్రి ఆబ్దికం ఆచరించి స్నానం చేసి తల్లి కం పెట్టాలి. ఋగ్వేదులలో మాత్రం మృతిక్రమాన్ని అనుసరించి పెట్టాలి. వంట తం ఒకటే. ఆశౌచంలో పడటంవల్ల శుద్ధినాడు తల్లిదండ్రులిద్దరికీ ఆబ్దికం వలసి వస్తే ఎవరి తిథి ముందైతే వారికి ముందు పెట్టాలి. తల్లిదండ్రుల తిథులు

పక్కపక్కనై ఏ సంవత్సరంలోనైనా తిథిద్వయం వచ్చినా ఇట్లాగే ఈ సందర్భాలలో వంటలు వేరుగా చేయాలి. తండ్రి పితృశేషాన్నే కర్త భుజించాలి. తల్లిదండ్రులలో ఒకరి మాసికంనాడు మరొకరి ఆబ్దికం పెట్టవలసి వస్తే ముందుగా ఆబ్దికం పెట్టాలి. ఒకేరోజున మూడు ఆబ్దికాలు పెట్టవలసివస్తే రెండు తానుపెట్టి మూడవది తమ్ములలో ఒకరిచేత చేయించాలి. తమ్ములు లేకపోతే తల్లిదండ్రులవి ఆనాడు పెట్టి మరొకరిది మరునాడు పెట్టాలి. జ్ఞాతుల ఆబ్దికాలు 2గాని, 3గాని ఒకే రోజున తటస్థ పడితే మరణక్రమాన్ని అనుసరించాలి. ఆక్రమం తెలియకపోతే దగ్గరివారికి ముందు పెట్టాలి.

## కర్మ మధ్యలో ఆబ్దికము

1. తల్లి చనిపోయిన 10 రోజులలో తండ్రి ఆబ్దికం వస్తే 11వ రోజున శ్రాద్ధ హోమం చేసి, తండ్రి ఆబ్దికం జరిపి, తరువాత తల్లికి షోడశశ్రాద్ధం జరపాలి.

2. తండ్రి చనిపోయిన 10 రోజులలో తల్లి ఆబ్దికం వస్తే 11వ రోజున తండ్రి షోడశ శ్రాద్ధం పూర్తి అయ్యాక తల్లి ఆబ్దికం పెట్టాలి.



3. తల్లిదండ్రులు కాక మరొకరికి తాను కర్త అయి కర్మ చేస్తుండగా తల్లి దండ్రులలో ఎవరి ఆబ్దికమైనా ఆశౌచంలో పడితే 11వ రోజున ఆద్యాది శ్రాద్ధాల అనంతరం ఈ ఆబ్దికం పెట్టాలి.

4. తల్లిదండ్రులు కాక మరొకరికి తాను కర్మ చేస్తుండగా, తాను కర్తగా ఉన్న మరొకరి ఆబ్దికం ఆశౌచంలో పడితే 12వ రోజున ఆ ఆబ్దికం పెట్టాలి. 13వ రోజున సాపిండ్యం జరపవచ్చు.

5. తల్లిదండ్రులలో ఎవరికైనా కర్మ చేస్తుండగా, తాను కర్త అయిన మరొకరి ఆబ్దికం (కర్మచేసే 12 రోజులలో) తటస్థ పడితే ఆ ఆబ్దికాన్ని 13వ రోజున పెట్టాలి.

6. తల్లిదండ్రులు కాక మరొకరికి అసలు కర్త తరపున తాను కర్మ చేస్తుండగా (ఉదా. పితామహుడు తన పౌత్రుడు చనిపోగా అతని సోదరుల ప్రతినిధిగా గాని, అతని తండ్రికి ప్రతినిధిగా గాని కర్మచేయవచ్చు) ఆ ఆశౌచంలో తల్లి లేక తండ్రి ఆబ్దికం పడితే శుద్ధినాడు ఆబ్దికం పెట్టాలి. కర్మశేషం మరొకరిచే జరిపించాలి. (దహనం నుంచి)

7. ఒకడు తల్లిదండ్రులకుగాని, సవతితల్లికిగాని కర్మచేసి సంవత్సరంలోపుగా పోతే, అతని సోదరులు లేని పక్షంలో అతని కుమారుడు ఈ మాసికాలను, ాలను, సంవత్సర విమోకాన్ని జరిపి ఆపివెయ్యాలి.

8. తనసోదరునకు కర్తగాఉన్న వ్యక్తి చనిపోతే తక్కిన సోదరులలో చిన్నవారిలో వాడుగాని, చిన్నవారు లేనప్పుడు అన్నగార్లలో చిన్నవాడుగాని ఇతని బదులు ్యాలి. (ఇతని కుమారులు ఇతనికి మాత్రమే కర్మ చేస్తారు.) వేరే సోదరులు పోతే, ఇతడు ఎవరికి కర్తగా ఉన్నాడో అతని భార్య జీవించినంత కాలం ఆమె అవుతుంది. సవతితల్లికి కర్తగా ఉన్నవాడు చనిపోతే అతని సోదరులు వరస ంలో కర్తలౌతారు.

9. పుత్రులు లేని వ్యక్తియొక్క ఆస్తి దౌహిత్రులకు సమానంగా క్రమించినప్పుడు అతనికి, అతని భార్యకు కూడా దౌహిత్రులు వరుస క్రమంలో ౌతారు (పెద్దవాడి అనంతరం తరవాతివాడు వగైరా) అంతటితో సరి. తాతగారి లో ఎక్కువ భాగం దౌహిత్రులలో ఒకనికే సంక్రమిస్తే (ధనహారి దౌహిత్రుడు) డు మాత్రమే కర్త అవుతాడు. అతని అనంతరం అతని సోదరులు ధర్మబుద్ధితో ్మమ్మ తాతల ఆబ్దికాలు పెట్టవచ్చు.

10. పై సందర్భాలు కాక తండ్రి సోదరులకుగాని తదితరులకుగాని కర్త ున వ్యక్తి చనిపోతే కర్తృనష్టం అవుతుంది. ఆ ఆబ్దికాలు మరెవరూ సాగించక్కరలేదు. (పోయిన వ్యక్తి భార్య జీవించి ఉంటే ఆమె కర్త అయి సాగించాలి)



## ఇతరములు

సోదరులు సమిష్టిగా తల్లిదండ్రులలో ఎవరికైనా మాసికాదులు జరిపేటప్పుడు దులో ఒకరికి ఆశౌచం సంక్రమిస్తే తక్కినవారు మాసికాలు, ఊనములు, సంవత్స ాకము వంటివి పెట్టవచ్చు. షోడశ సాపిండ్యముల సమయానికి అన్నదమ్ములలో రికి ఆశౌచం వచ్చినా శుద్ధిరోజున పెట్టాలి.

ఆహితాగ్ని కానివారు బ్రహ్మయజ్ఞాది నిత్యకృత్యాలు, దేవతార్చన, వైశ్వదేవం టివి శ్రాద్ధం రోజున శ్రాద్ధానంతరం చేయాలి. కర్త పితృశేషం మాత్రమే తినాలి.

గ్రహణం నాడు ఆబ్దికం పెట్టవలసివస్తే గ్రహణానికి ముందుగాని, తరువాతగాని పంచాంగంలో సూచించిన ప్రకారం ఆచరించాలి. ఈ సందర్భంలో రాత్రి అయినా సరే ఆ రోజునే ఆబ్దికం పెట్టాలి. ఇంకే సందర్భంలోనూ ఆబ్దికం రాత్రి పెట్టకూడదు.

అనుమాసికాలలోను, ఊనమాసికాలలోను, సంవత్సర విమోకంలోను, పితృసూక్తం చదవకూడదు. తక్కిన ఆబ్దికాదులలో చదవాలి.

భోక్తలు భోజనం ప్రారంభించాక కర్త ఇంటిలోనే జనన మరణాలు సంభవిస్తే ఆశౌచ శుద్ధి తరవాత తిరిగి ఆబ్దికం పెట్టాలి.

ఆబ్దికం మధ్యలో భోక్తకు వాంతి అయితే ఆబ్దికం ఆపి, కర్త ఆ రోజు ఉపవాసం ఉండి మరునాడు ఆబ్దికం పెట్టాలి.

ఆబ్దికాదులలో 'మధువాతా' అనే మంత్రం చెప్పినప్పుడు భోక్తల విస్తరులలో తేనె ఉంచాలి. తేనె లేకపోతే మంత్రం చెప్పితే చాలు. అంతేకాని బెల్లంవంటి ప్రత్యామ్నాయాలు ఉంచకూడదు.



భోక్త ఆబ్దిక మంత్రం చెప్పకూడదు. అట్లా చేస్తే కర్త భోక్తల పితృదేవతలు నరకానికి పోతారు. అందుచేత మంత్రం చెప్పేందుకు వేరే బ్రాహ్మణుని నియమించాలి.

వివాహం, ఉపనయనం, చూడాకర్మ జరిపినాక క్రమంగా సంవత్సరం, 6 నెలలు, 3 నెలలు మృత్తికాస్నానం, నిత్యతర్పణశ్రాద్ధం, శ్రాద్ధాంగ తర్పణం వంటివి తిలలతో చేయకూడదు. నీళ్లు మాత్రమే వదలాలి. గర్భాదానం తరువాత ఈ నియమం ఒక నెలవరకు పాటించాలి.

మామ, మేనమామ, అన్నగారు, కుమారుడు, గురువు, బ్రహ్మజ్ఞాని, యోగీశ్వరుడు వీరి శ్రాద్ధంలో పితృశేషం తింటే దోషం లేదు.

భోక్తలకు ఆపోశనం ఇచ్చేటప్పుడు, అర్చన మొదట్లో 'ఉదకమాపూర్య' అని దొన్నెలలో నీళ్లు పోసేటప్పుడు ఒకేసారి తగినంత పొయ్యాలి. కొంచెం కొంచెంగా ఎక్కువసార్లు పొయ్యకూడదు.

అర్చనలో భోక్తలకు వస్త్రదానం చెయ్యటం చాలా ముఖ్యం. శక్తి లేకపోతే కనీసం యజ్ఞోపవీతమైనా ఇవ్వాలి.

సంకల్పము, పాద్యము, ఆసనము, ఆవాహనము, అర్ఘ్యము, అన్నదానము, పిండదానము, అక్షయము - ఈ సందర్భాలలో పితృదేవతల గోత్రనామాలు (వర్గత్రయం) చెప్పాలి. స్వాగతం, స్వస్తివాక్యం, గంధం ఇవ్వటం, విష్టరం, వికిరం వీటియందు గోత్రనామాలు చెప్పక్కరలేదు. అంతేకాక స్వాగతం, నమస్కారం, ప్రాణాయామం, పాదప్రక్షాళనం, పిండపూజ, హోమం ఇవి సవ్యంగానే చెయ్యాలి. శ్రాద్ధ సమయంలో అగ్ని ఆరిపోయినా, దీపం ఆరిపోయినా కర్త ఉపవసించి తిరిగి శ్రాద్ధం జరపాలి.

తల్లిదండ్రులు చనిపోయిన మొదటి సంవత్సరంలో గయాశ్రాద్ధం, మహాలయం, అమావాస్య శ్రాద్ధం చెయ్యకూడదు.

## దశదానములు

1. గోవు, 2. భూమి, 3. నువ్వులు, 4.బంగారము, 5. నేయి, 6. వస్త్రము, 7. ధాన్యము, 8. బెల్లము, 9. వెండి, 10. ఉప్పు.



## షోడశ మహాదానములు

1. గోవు, 2. బంగారము, 3. గేదె, 4. రత్నము, 5. సరస్వతి, 6. కన్య, 7. పత్ని, 8. గుఱ్ఱము, 9. యేనుగు, 10. దాసి, 11. ప్రత్తి, 12. భూమి, 13. గృహము, 14 ఉపకరణములతో గూడిన మంచము, 15. మేక, 16. బండి

**మరొక సాంప్రదాయము :**

1. కన్య, 2. బంగారము, 3. దాసి, 4. బండి, 5. గుఱ్ఱము, 6. యేనుగు, 7. గృహము, 8. నాగలి, 9. కాలపురుషుడు, 10. కాలచక్రం, 11. భూమి 12. బంగారపు కొమ్ములతో గూడిన మేక, 13. గేదె, 14. స్రవించెడి గోవు, 15. లేడి చర్మము, 16. కల్పవృక్షము





## ముత్య వీర వేంకట దీక్షితులు

**జననం** : 12-10-1933, రాజమండ్రి

**తల్లిదండ్రులు** : సీతామహాలక్ష్మి, సీతారామమూర్తి

**ఉద్యోగం** : 1) 1955 ఫిబ్రవరి నుంచి జాతీయ బోదవ్యాధి నియంత్రణ శాఖలో (మండపేట, తూర్పు గోదావరి జిల్లా) పరిశీలకునిగా,

2) 1957 జూన్ నుంచి తూర్పు రైల్వేవైద్యశాఖలో ఆరోగ్య పరిశీలకుని గాను, కుటుంబసంక్షేమ విభాగంలో విస్తరణ విద్యాబోధలకునిగా,

3) 30-9-1990న స్వచ్ఛంద పదవీ విరమణ అనంతరం వివిధ స్వచ్ఛంద సేవా సంస్థలలో (విజయవాడ, నెల్లూరు మొదలగుచోట్ల) వివిధ హోదాలలో 2000 ఆగష్టు వరకు)

**ఇతర రచనలు** : 1) సంస్కార కాలసంగ్రహణము

2) పూజ చేయడం ఎలా ?



## పొన్నపల్లి వేంకట కృష్ణయ్య

**జననం** : 13-12-1932

సేలంజిల్లా, మెట్టూరు

**తల్లిదండ్రులు** : సూర్యకాంతం

వీరరాఘవ సోమయాజులు

**ఉద్యోగం** : 1) 1958 జూలై నుంచి 1992 డిసెంబరు వరకు, ఆంధ్ర విశ్వ కళాపరిషత్ గణితశాస్త్ర అధ్యాపకులు.

2) 1994 డిసెంబరునుంచి 2000 జూన్ వరకు డా॥ లంకపల్లి బుల్లయ్య పి.జి.కళాశాల, విశాఖపట్నంలో గణితశాస్త్ర శాఖాధ్యక్షుడు.

**ఇతర రచనలు** : 1) తెలుగు అకాడమీ, హైదరాబాదు ప్రచురణలో కొన్ని గణితశాస్త్ర గ్రంథాలు (తెలుగులో)

2) భర్తృహరినీతి - భర్తృహరి సుభాషితాలలో నీతి శతకానికి పద్యానువాదం





**శివకామేశ్వరి గ్రంథమాల**

41-22/4-36, భ్రమరాంబాపురం, కృష్ణలంక,